శ్రీరామ శ్రీరామ శ్రీరామ

ఓం.

శ్రీ రుక్మిణీ పాండురంగ ప్రసన్నం.

# శ్రీ ఘటికాద్రి క్షేత్రమహాత్మ్యము.



ఘటికాద్రి హరి యోగాసంబి

పబ్లిషర్ కె. సీతారామయ్య,
విఠల్ విలాస్ బుక్ డిపో, కడప.

మొదటికూర్పు 2000 ప్రతులు

చిత్తూరు డి. డిస్ట్రిక్టు ప్రింటింగ్ వర్క్సునందు
ముద్రించబడిరి.

మార్చి 1934 వెల 0-5-0.

శ్రీరామ శ్రీరామ శ్రీరామ

# వావిళ్ల యితరగ్రంథములు.

| గ్రంథము | వెల |
|---|---|
| అచ్చ తెనుగు రామాయణము | 1—4 |
| అనంతునిఛందము | 0—12 |
| అప్పకవీయము (విమర్శతో) | 2—8 |
| అప్పకవీయ విమర్శనము | 0—8 |
| ఆంధ్రభాగవతము | 5—8 |
| ,, 2 సంపుటములు | 7—8 |
| ,, 3 సంపుటములు | 8—4 |
| ఆంధ్రభారతము 7 సంపు | 14—0 |
| ,, 3 సంపుటములు | 13—0 |
| ఆదిసభాపర్వములు | 2—0 |
| అరణ్యపర్వము | 2—0 |
| విరాటోద్యోగపర్వములు | 2—0 |
| భీష్మద్రోణపర్వములు | 2—0 |
| కర్ణశల్య సౌప్తిక స్త్రీపర్వములు | 2—0 |
| శాంతిపర్వములు | 2—0 |
| అనుశాసనిక 8 పర్వములు | 2—0 |
| ఆదిపంచకము | 5—0 |
| యుద్ధపంచకము స్త్రీపర్వము | 3—12 |
| శాంతిసప్తకము | 3—12 |
| ఆంధ్రనామ సంగ్రహము | 0—12 |
| క్యాలికో | 1—0 |
| ఉత్తరరామాయణము | 2—0 |
| వస్తుగుణదీపిక | 5—0 |
| కుచేలోపాఖ్యానము సటీక | 0—4 |
| డిటో గట్టి పథువు | 0—6 |
| గజేంద్రమోక్షము సటీక | 0—8 |
| డిటో క్యాలికో | 0—8 |
| గోపీనాథరామాయణము 2 సంపుటము | 7—8 |

| గ్రంథము | వెల |
|---|---|
| నలోపాఖ్యానము సటీక | 0—8 |
| నలచరిత్ర ద్విపద క్యాలికో | 0—14 |
| భాస్కర రామాయణము | 4—0 |
| మనుచరిత్ర సటీక క్యాలికో | 2—0 |
| మొల్లరామాయణము | 0—10 |
| రంగనాధరామాయణము ద్విపదక్యాలికో | 3—0 |
| రాఘవ పాండవీయము | 2—0 |
| రుక్మిణీకల్యాణం స.టీక | 0—8 |
| డిటో క్యాలికో | 0—8 |
| వసుచరిత్ర సటీక | 4—0 |
| వసిష్ఠజనక సంవాదము | 0—8 |
| వాసిష్ఠరామాయణం ద్విపద | 1—4 |
| వేంకటాచల మహాత్మ్యము | 1—0 |
| వేమనపద్యములు ఇంగ్లీషుతో | 1—4 |
| ,, 2728 చిన్న సైజు | 1—12 |
| ,, ఆంధ్రతాత్పర్యముతో | 3—8 |
| శతకంఠరామాయణము | 0—12 |
| సహస్రకంఠరామాయణం | 0—12 |
| సులక్షణసారము సటీక | 0—8 |
| సీతారామాంజనేయ సంవాదం టీకా తాత్పర్యము | 3—8 |
| భగవద్గీత మూలము | 0—4 |
| ఆంధ్రతాత్పర్యము డిటో గ్లేజు క్యాలికో | 1—4 |
| (భగవద్గీత)కు శంకరలింగ శాస్త్రులవారికృతటీకాతా॥ | 1—8 |
| భగవద్గీతా గూఢార్థదీపిక శ్రీమత్ పరమహంస శాల | |

ఓం.

శ్రీ రుక్మిణీ పాండురంగ ప్రసన్నం.

# ఘటికాద్రి హాట యోగానంద

# భజన సంకీర్తనలు.

## శ్రీ ఘటికాద్రిక్షేత్ర మహాత్మ్యము.






గ్రంథకర్త,

పండరీభక్త ఎ. నారాయణదాసు,

కలియుగ కడద్వారకాపురమను కడప.



పబ్లిషర్ కె. సీతారామయ్య,

విశల్ విలాస్ బుక్ డిపో, కడప.

మొదటికూర్పు 2000 ప్రతులు.

చిత్తూరు డి. డిస్ట్రిక్టు ప్రింటింగ్ వర్క్సునందు,
ముద్రింపబడియె.





మార్చి 1934 దీనివెల **0-5-0.**

ఓం.

శ్రీరుక్మిణీ పాండురంగ ప్రసన్నం.

భక్తాగ్రేసరులారా!

దైవ ప్రేరేపణ చేతనున్నూ, పెద్దల ఆశీర్వాదముల చేతనున్నూ, నేను విద్యాహీనుడైయుండి యీ గ్రంథమునందు ఘటికాచలక్షేత్ర మహాత్యమున్నూ, ఘటికాచల క్షేత్ర నాథుని సేవార్థులు సేవచేయు పద్ధతులున్నూ, యీ క్షేత్ర మహాత్యము నాఅనుభవములో తెలుసుకొని దృష్టాంతరముగా చూచిన అద్భుత విషయములున్నూ, ఘటికాచలయాత్రకు వెళ్లు (భజనబృందములు) పాడుకొననలస్ని, భజనానంద సంకీర్తనల చేతనున్నూ, నామసంకీర్తనలుగల నామావళి కీర్తనల చేతనున్నూ, యోగాంజనేయులవారి దండకము, శ్రీనృసింహస్వాములవారి దండకము, శ్రీలక్ష్మీదేవి దండకము, పండరీ విఠలస్వామియొక్క విన్నప ధ్యానములతోను, శ్రీకృష్ణలీలతోను, మేలుకొలుపులతోను యీ గ్రంథమునందు యెటువంటి మూఢులకైనను బాగుగా తెలియునట్లు రచియించి ముద్రింపబడినైనది. యీగ్రంథము ముఖ్యముగా (భజన సమాజమువారున్నూ) ఘటికాద్రి సేవచేయువారున్నూ, ఘటికాద్రిసేవకులైనవారున్నూ, యిందులోవుండబడిన, విఠలేశ్వరుల విన్నపములతోను సంకీర్తనలతోను, యీ మూఢభక్తుడు మూఢభక్తితో రచియించిన తేట పదములుగల స్తుతులు, వుదయ సాయంకాలములయందు పఠించుచూ, దైవదృష్టాంతరములనుగని దైవకటాక్షముచే శాశ్వత పదవులనుభవించెదరని ప్రార్థన. గ్రంథమునందు టీకను ముందుగా చదువ వలెను.

# పాండురంగ బృందావన సంకీర్తనలు

# 2-వ భాగం గ్రంథము రాబోవుచున్నది.

సీ॥ యీగ్రంథ కీర్తనల్ - యేలాగుజూపెదవో
యీభారమునీదె - యాంజనేయ
నీదివ్యమహిమంబు - ధరనెట్లుజూపునో
నీభారమేనయ్య - ఆంజనేయ
యీగ్రంథ దోషముల్ . బ్రద్ధలై బోనట్లు
యేలాగు దిద్దెదవొ - వీరధీర
గణయతి ప్రాసముల్ - ఘనముగానున్నట్లు
కృపనెట్లు జూపెదవో - గండివీర

గీ॥ హాస్యపకీర్తి నీకె - నాకేమిలేదు
హాని అపవాద - ఆనంద కీర్తులెల్ల
ఆంజనేయు నీవేయని - నమ్మినేను
జంకులేకనే భక్తితో - వ్రాయగంటి ॥

ఇట్లు,

కడవ పండరీభక్త ఎ. నారాయణదాసు

# కాపీరైటు ప్రకటన.

శ్రీమాన్ కడప పండరీ భక్త ఎ. నారాయణదాసు గారిచే రచియించబడిన యీగ్రంథము ఘటికాచల క్షేత్రము లో శ్రీ యోగాంజనేయ స్వామి సన్నిధియందు గ్రంథకర్త గారివల్ల 1934 సం॥రం మార్చినెల 9 తేదిలో సర్వకాపీరైటు హక్కును నేను పొందియున్నాను. గాన యీ పుస్తకమును ఇండియా కాపీరైటుచేతను, పర దేశీయపు కాపీరైటుచే తను సురక్షితమయినది. యెవరుగాని యీ పుస్తకమును సంపూర్ణముగా గాని, లేక యిందొక భాగముగాని తా ము వేరుగా ప్రకటించుటకును, మరియొక భాషయందు తర్జుమాచేసి క్రయమునకు, యిచ్చుటకుగాని, హక్కు యియ్య బడదు. యిందుగల పటములనుగాని, భావములనుగాని, పద ములనుగాని, యేమాత్రమయినను కాపీచేసినయెడల అది కాపీ రైటును ఉల్లంఘించుటయే యగును. గనుక కాపిరైటును యేవిధమున నుల్లంఘించిన వారు దావాకు లోనగుదుర దీనిచే తెలియనగును.

ఇట్లు బుధజన విధేయుడు,<br>
విఠల్ విలాస్ బుక్‌డేపో,<br>
కె. సీతారామయ్య,<br>
పుస్తకముల వ్యాపారం, కడప

# గ్రంథకర్తగారి విన్నపము.

యీ గ్రంథమునందు ముద్రించిన కీర్తనలన్నియు, దైవ ప్రేరేపణచే నాచే వ్రాయబడి కడప బుక్కుసెల్లర్, కె. సీతారామయ్యగారికి యిందుగల సర్వహక్కులు శాశ్వితముగా అనుభవించుకొనులాగున అధికారం యిచ్చియున్నాను. గాన యిందులో ముద్రించిన కీర్తనలుయేవికాని యెవరైన ముద్రించినను అంకితములు మార్చి పాడినను, నాఅనుమతిలేకనే నాఫోటోబ్లాకులను, యేపుస్తకములలోనైనా ముద్రించినను, దావాకు పాత్రులయి నేగోరు నష్టమునకున్నూ, నాకొచ్చు నష్టమునకున్నూ, దావాఖర్చులకున్నూ, జవాబుదార్లుగా నుందురని తెలియ చేయడమయినది. పబ్లిషర్‌గారగు కె. సీతారామయ్యగారు ప్రతికూర్పు ముద్రించబొయ్యే కాలములో నాకు తెలియబరచి ముద్రించుతూయున్నూ, యిందులో వ్రాయబడిన విషయములను, మార్చకుండాయున్నూ, యితర విషయములు చేర్చకుండా యున్నూ జరిగించవలయును. యిందుకు విరుద్ధముగా యేమి జరిగించినను గ్రంథ తిరస్కారముచేసినందుకు గ్రంథముయొక్క హక్కును తొలగించడమేగాక నా మాన నష్టమునకు జవాబుదారిగా వుండవలెను.

పండరీభక్త ఎ. నారాయణదాసు,
ప్రస్తుతం చోళంగిపుర క్షేత్రం.

# కృతి సమర్పణము.

---

భక్త వత్సలుడును కరుణాసముద్రుండును, ఘటికాద్రి క్షేత్రనాథుడును, గాలి, గ్రహ రోగబాధల నివారణుండగు శ్రీ లక్ష్మీ నృసింహస్వాముల పాదార విందములనున్నూ, అఖిలలోక సంచారిణియైన అమృతవల్లి తాయారులగు శ్రీలక్ష్మీ దేవియొక్క పాదారవిందములకున్నూ, ఘటికాద్రి మేటి ధీరుండగు యోగాంజనేయుల స్వామిపాదార విందములకున్నూ, యీఘటికాద్రి హారయోగానంద భజనకీర్తనలు అను చిన్న పొత్తమును ఒకతులసీ దళముగాను పుష్పమొగ్గగాను సమర్పించుచున్నాను.



# విషయసూచిక.

# పీ ఠి క.

భగవద్భక్తులగు తల్లితండ్రుల పాదధూళి అణురేణువనై నేసాష్టాంగదండములు సమర్పించి తెలుపుకొన్న విజ్ఞాపన.

అఖిలాండకోటి బ్రంహ్మాండ నాయకుండైన శ్రీమత్పండరీనాథుని కరుణారసంబుచే యిదివరలో శ్రీపాండురంగ బృందావన సంకీర్తనల గ్రంథము మొదటిభాగం 1, 2, 3, 4 వ కూర్పు వరకు ముద్రించి శీఘ్రకాలములోనే పండరీ నాథుని పూర్ణకటాక్షముచేత యిప్పటికి పదివేల గ్రంథములు కంటె యెక్కువగా ఖర్చుఅయి యీ ఆంధ్రదేశమున కడప, నెల్లూరు గుంటూరు, చిత్తూరు, అనంతపురం, బళ్ళారి, కడప, కర్నూలు, నైజాము వగైరా జిల్లాలయందు యీగ్రంథముల ద్వారా పండరీ బృందావన భజన సమాజము లేర్పడి విఠలనాదముతో దేశమంతయు ప్రబలివుండిన విషయము యెల్లరకు తెలిసిన విషయమే.

భక్తాదులారా! బాల్యమునుండి మదోన్మత్తుడయి తాగుబోతులవెంట తిరిగి ధనమార్జింప గలిగి బొంబాయివగైరా గొప్పపట్టణముల యందు వ్యాపారము చేయుచూ అనేక దుర్విషయములలో ప్రవర్తనచేస్తూ నష్టకష్టములు సంభవించి నీచవృత్తులలో సంచరించుతూ దేశయాత్రలుచేస్తూ నాతండ్రి యగు, దీనదయాళుడను, పండరీనాథుని దివ్య సందర్శనముచే, దుష్ట ప్రవర్తనలయందు విసుగుపుట్టి పండరీ భజనానంద పరుడ

నై నాకు యేవిద్యయందును, శ్రీరంగధాముని ప్రేరేపణచేత నాశక్తి కొలది శ్రీపాండు రంగనియందు కీర్తనలుచేశి వెల్లడి చేస్తిని. పండితుడననిన్నీ ఇది ఒక ప్రజ్ఞ అనిన్నీ కీర్తిసంపాదించ వలెననిన్నీ, లేక యీ గ్రంథములద్వారా ధనమార్జింపవలయు ననిన్నీ, మెప్పుకై యీ గ్రంథములు ముద్రించి యుండలేదు. సాధారణమైన అల్ప విద్య తప్ప మరేవిధమయిన విద్యలయం దును బొత్తిగా అభ్యాసములేక పోయినను, నిత్యవ్యవహార ములలో వాడుకొను సాధారణ పదములచేత కీర్తనలుగా ము ద్రించ గలిగితిని. ఇట్లుండ కలియుగ కడద్వారకాపురమను కడప పురంబున గడచిన మాఘశుద్ధ ద్వాదశిరోజు రాత్రి 12 గంటల కాలమందు ఆంజనేయుండు ఒకభక్తునికి ఆనందముతో ఆవేశమై భక్తా నీవు యిప్పుడే బయలుదేరి నాయోగసింహాసన ముండు ఘటికాద్రిక్షేత్రముజేరి అచ్చట కొద్దిరోజులు నివాస ముచేయుము. తదుపరి నాక్షేత్రమునందు అనుదినం నీకు నా యొక్క లీలావినోదములతో వర్తమానములు తెలియజేసెద ననిన భాగ్యమని యీదాసుడు అదేరాత్రి బయలుదేరి యీ ఘటికాద్రి క్షేత్రమును ప్రవేశించ సకల పాపములు హరించగ లిగిన పావనమైన పాండవ తీర్థంబున స్నానముచేసి శ్రీయో గాంజనేయ స్వాముల దివ్యమంగళకర విగ్రహమును దర్శించి ప్రార్థించి, ఆరాత్రిఅచ్చటనే నిద్రించగా శ్రీవారు సాక్షాత్క రించి, భక్తా నా ఆజ్ఞ వచ్చువరకు యిచ్చటనే నివాసముగా వుండి నీవురచించిన కీర్తనలచే అను దినము భజనకాలక్షేప ములు జరిగించుతూ వుండవలెనని అదృశ్యుడై నంతట మరుది

వనమునుండి, శ్రీమాన్ గోపాల్ రెడ్డిగారు కట్టించిన శ్రీరామ భజన మందిరమువద్ద దేశదేశములనుండి రాబడిన సేవార్త భక్తులతోను కొండపాళెము చోళంగిపురం భక్తాదులతోను శ్రీభాగవత సుబ్రిమణ్యం నాయుడుగారి భక్తాదులతోను అను దినము భజన కాలక్షేపములు జరిగించుతూవుండి మరి దైవాజ్ఞచే, గడచిన పాల్గుణ శు ౧౧ లు శనివారంరోజున యీ క్షేత్రమునకు చుట్టుప్రదేశములలో వుండబడిన భజన బృందములను రప్పించి అఖండ భజనలుగా ఏకాహామను 24 గంటలు భజనలు బ్రంహ్మానందముతోను జరిగించి సేవార్థుల ధనసహాయముతోను తదితర భక్తాదుల ద్రవ్య సహాయముతోను, శ్రీమాన్ జయరామరెడ్డిగారి గొప్ప సహాయముచేతను రమ్యారమి రెండువేల మందికి 2 దినములు అన్నదాన సంతర్పణ, శ్రీవార్ల కటాక్షముచే మహా వైభవముగా జరిగినదానివల్ల ధన్యుడనై తిని.

తదుపరి యీ క్షేత్రమునందు నివసించి యీ క్షేత్రనాథుని కృపాకటాక్షము కొరకై అనేక భక్తాదులున్నూ, తల్లులున్నూ అనేకులును గలరు. కొందరు తల్లితండ్రుల సేవచేస్తూ వుండే విధములు చూచియు, యీ క్షేత్ర అత్యద్భుతమగు మహిమలను నా అనుభవములో తెలిసికొనియు దైవప్రేరేపణచేత, యీ క్షేత్రిమహిమను గురించియు, క్షేత్రినాథుని గురించియు, సేవార్థుల గురించియు, ఒక చిన్నగ్రింథముగా వ్రాశి, శ్రీవార్ల సంకీర్తనలు ముద్రించ వలయునని, సంకల్పముకలగి, పూర్వము మహానుభావులగు పండితోత్తములు

అనేకులు వారివారి ముందువుండబడిన గ్రంథముల బట్టియు, పండితుల విద్యాబలమును కవిచమత్కారముచే, విద్యాప్రవీణతతో అనేక గ్రంథములు వ్రాసియున్నప్పటికిన్నీ, యీదాసుడు, స్వానుభవములో క్షేత్రనాథుని అద్భుత మహిమలను తెలుసుకొన్నవాడై, యిదిఒక గ్రంథముగా వ్రాయగలిగితిని. కాన, యిందులో అనేక లోపములుండునని తలచి యుండినను పెద్దలచే పరిష్కరింపక, నిత్యవ్యవహార పదములతో గ్రంథమని వ్రాసినందుకు, ఆగ్రహించక "చెరుకునకు వంకబోతేమి చెడున తీపు" అనునట్లు భగవన్నామమును గురించి వ్రాసినందుకు, తప్పులగని తిరస్కరించక, నాదోషములను పంచుకొనక, నాయందు పుత్రి వాత్సల్యముచూపి ప్రజామెప్పుకై ఆర్జనకై, కీర్తికై, ప్రజ్ఞకై, వ్రాశిన గ్రంథము కాదని దృఢముగా నమ్మి నన్నానందింప జేసెదరని ప్రార్థన.

భక్తుల పాదధూళి రాజయోగి,
పండరీభక్త ఎ. నారాయణదాసు.

ఓం.

# ప్రార్థన.

దేవ దేవా, వాసుదేవా, దీనబందో, యీ దాసుడు, మీ ఆజ్ఞచె యీ ప్రాంత్యమునందు, యేపరిచయములేకుండా, యీక్షేత్రమునందు, ద్రవ్యహీనుండై ప్రవేసించినదిమొదలు మీయొక్క కటాక్షముచేత, మ-రా-రా-శ్రీ, మీపాదసేవ చేయు చెంగల్పట్టు బిగ్‌నత్తం యం. యన్. జయరామరెడ్డి గారగు రివిన్యూ యిన్‌స్పెక్టరుగారు నన్నాదరించి నేజేయు మీపూజా కైంకర్యములకు ధన సహాయముతో భక్తిశ్రద్ధల తోను, సంతోషముతో జరిపించడమేగాక మీ ప్రేరేపణచేత యీదాసుని నిమిత్తమయివచ్చు భక్తబృందములకు, శక్తివం చనలేకుండా, సర్వోపచారములచే భూత తృప్తి యొనర్చుచూ నా సర్వఖర్చులు వీరేభరించుతూ ఆనందముతో నాకే కొరత లేకుండా, నేజేయు నీకైంకర్యములు సక్రమముగా జరుగుటకున్నూ, యీచిన్నగ్రంథమును వ్రాయుటకు అవకాశము కలుగజేసినందుకున్నూ మీపాదసేవకోరు మీ దాసదాసుడు, రెడ్డిగారే మీ కటాక్షముచేత కారణకర్తలయివున్నారు గాన, ప్రభూ, పండరినాథా రుక్మిణీ నాథా, లక్ష్మీసమేతుండవగు నార సింహావీర హనుమా అమృతవల్లీ తాయారమ్మా, యీ దాసుడు పాడినకీర్తనల ఆలకించి, రెడ్డిగారిని రక్షించి, మీకీర్తి చాటించి, రెడ్డిగారి రుణము విక్తునిగానజేసి, రెడ్డిగారి వంశ పరంపరలుగా మీ కృపాకటాక్షములభింపజేసి ఇహ

లోకానంద భక్తి ఆనంద పదవులతోను, పుత్ర సంతానముల తోను, శరీరారోగ్యములతోను, సుఖింపజేసి పరలోక ప్రాప్తి శాశ్వతానందమునిచ్చెదరని, శ్రీవారి దివ్యచరణారవిందము లను బట్టి ప్రార్థించుచున్న వాడను.

శుభం. శుభం. శుభం. శుభం. శుభం.

మీ దాసదాసుడు,

పం॥ భ॥ ఎ. నారాయణదాసు.





చోళంగిపురమునకు సమీపములో ఘటికాద్రి క్షేత్రమున

చిన్నకొండపైయుండు,

## చతుర్భుజ యోగాంజనేయులు.

ఓం.

శ్రీరుక్మిణీ పాండురంగ ప్రసన్నం.

# ఘటికాద్రి క్షేత్ర మహాత్మ్యము.

---

శ్రీమద్భరత ఖండమున, పండితోత్తము లెంద రెంద రో వొక్కొక్క పుణ్యపురుషుడు, అనేక క్షేత్రములను సేవించుతూ వొక్క క్షేత్రమునందే వక్క మూర్తియందే, తన మనస్సును లయింపజేసి తన దృఢభక్తి నిజూసి ఆయా పుణ్యక్షేత్రమునున్నూ ఆయా క్షేత్రనాథుని దివ్య ప్రభావములున్నూ వర్ణించి, వ్రాశి వెల్లడిచేసిరి, ఏ క్షేత్రమహిమను వర్ణించినను 108 దివ్యక్షేత్రములలో కెల్ల-యీ క్షేత్రము పుణ్యక్షేత్రమని ఆయాక్షేత్ర మహిమలను, వారి వారి అనుభవములో దృఢ మేర్పడినందునయున్నూ, వారి వారి విద్యాభక్తి ప్రభావముల తోనున్నూ, ఆయాక్షేత్రముల ఆనవాలుబట్టియున్నూ, అంతకు పూర్వులు రచియించిన గ్రంథములుబట్టియున్నూ, వారి వారి జప తపయోగనిష్టలలో గోచరించిన అద్భుతమహిమలు బట్టియున్నూ, శాస్త్ర రీతిగా ఆయా క్షేత్రములనువర్ణించి వ్రాసి లోకోద్ధారణచేసి భక్తి జ్ఞానమునకు ముక్తిదారిజూపిన మహానుభావు లెందరో గలరు. వారందరిపాదధూళి అణురేణువనై సాష్టాంగ దండములు సమర్పించి, యీదాసుడు యేగ్రంథముచూచి గ్రహితకు దెచ్చుకొనుటకు యోగ్యతలేక, యే జ్ఞానమును దెలియక ఏవిద్యలు దెలియక ఆదినుండి ఆచార

హీనుండనై, అన్యాయశా పరుండనై, అనాచారభ్రష్టుండనై, దుష్టుడనై యేమహాను భావులపాదసేవ చేయకయిప్పట్లో నే నొక భక్తుడను, నేనొక గ్రంథకర్తను, నేనొక గ్రంథము వ్రాయుచున్నాను అని చెప్పుకొనుటకు, నాకే సిగ్గుగావుండి నప్పుడు లోకములో అనేకులకు యింకను పరిహాసముగానుం డునని, తలచెదను. అయినను బాల్యమునుండి నేను చేసినపాప కృత్యములకంటె ఇది యెక్కువకాదనిన్ని యీ విధముచే నయిన నాలత్యమును యీప్రకారం రామనామ భజనలో ప్ర వేసింపజేసిన నా పాపరాశి కొంత తరుగునని దృఢనిశ్చలుడనై వ్రాయగలిగితిని.

తల్లితండ్రులారా! పండితోత్తములు 108 దివ్యక్షేత్ర ములలోకెల్ల యీ క్షేత్రము దివ్య క్షేత్రమని పూర్వ గ్రంథములనుబట్టి వర్ణించినట్లు నేను కూడా నా మూఢ భక్తి చేతనున్నూ దైవాజ్ఞచేతను యీ క్షేత్రమున వసిం చి యీ క్షేత్ర మహిమలను నా దుష్టాంతరములో కన్ను లార జూచియు చెవులారవినియు అనుభవించియు ఆనందభరి తుడనై నాకు తెలిసినమటుకు వ్రాయగలిగినందుకు ఆనందిం తురుగాక.

శ్రీ మద్భరతఖండమున శ్రీ వెంకటాచల శేషాద్రి పర్వతములకు దక్షిణ భాగమున శ్రీ చోళసింహపురమను చో ళంగి పురముగలదు. యీపురమునకు అనతిదూరములో నే ఘటికాచల పర్వతమను వక దివ్యగిరికలదు. యీపర్వతము మీద గురి రెండు పర్వతములు ఒక చిన్నపర్వతము మరిఒక పెద్దపర్వతముగలదు. యీపెద్దకొండ గోపుర శిఖరమువలె

ఎత్తయి గోపురా కారమువలెనుండును. యీపర్వతముపైన ప్రాకార గోపురమంటములతోడను, చిత్రకారులగు గొప్ప శిల్పులచే ఇందు ఒక గొప్ప దేవస్థానముచేతనున్నూ, పావన మైన గంగాకొలనులచేతను, వానరసైన్యముచేతను, ఓంకార వాదముచేతను, మందమకరంధ మధురసుగంధ వాసనలచేతను శోభిల్లుచున్నది. యీపర్వతము పైవుండబడిన దేవస్థానగర్భా లయమునందు శంకు చక్రధరుడై యోగాసనాసీనుడై ఉగ్ర రూపుడై శ్రీనృసింహస్వామి దివ్య మంగళకరమూర్తియై కనక కిరీటము మెరయుచూ ధగధగమనుకాంతులతోడ పచ్చపతక ములతోడను, సుగంధ పరిమళ చందన వాసనలతోను శ్రీ వారు వేంచేసిన దివ్యవైభవము సేవించినవారికే తెలియును. కాని, చెప్పి వ్రాయతరముగాదు, శ్రీవారికి ప్రతిశుక్రవారము తిరుమంజనం శేవ జరుగుచుండును. ఆవైభవము సేవించినవా రికి ఇహసంభందమయిన ప్రాలుబ్ధకర్మములే కేమాత్రము అం టక సదానంద భరితులయి శాశ్వతసుఖము అనుభవించుటకు సందేహములేదు. శ్రీవారి దివ్యమంగళకర విగ్రహముయెదుట భక్తితోను ఏకదృష్టితోను కొంతసేపువరకు సేవించిన తన్మ యత్వముజెంది పులకాంకిత శరీరులయి నేత్రములనుండి ఆ నంద భాష్పములు ధారధారలుగా కారుచూ యెటువంటి కఠి నులకైనను శ్రీవారి దివ్యసేవచే ఆనంద ముప్పొంగకనుండదు. శ్రీవారిని సేవించి వారిసేవచేసిన భక్తాదులకు సర్వపీడలు తొ లగించి సర్వసంపదల నొసంగి శాశ్వతమైన సుఖములిచ్చుచుం డును. శ్రీవార్ల సన్నిధి ప్రక్కననే, అమృతవల్లి తాయారు

లను శ్రీలక్ష్మీదేవిగార్లు చతుర్భుజధారియై రెండు హస్తములం దు పద్మములుధరించి ఒకహస్తముతో యిక్కడసేవచేయవలె నని వామహస్తముతో భూమిని జూపుతూ, భక్తితోసేవచేశిన వారికి రక్షించెదనని మరొకహస్తముతో అభయాస్తము జూపు తూ, త్రిలోకసుందరివలె పీతాంబరధారియై, సువర్ణా భూష ణ అలంకారములతోను, రత్నఖచిత కిరీటముతోను, హస్త కంకణములతోను, ధండి గాధరించి ధరణిదేవివలె ధగధద్దాయి మానముగా ప్రకాసించుచున్నది. యీ దేవిగారి దివ్యదర్శ నము చేసి సేవచేస్తూ ప్రార్థించినవారలకు దారిద్రదశ దుర్గ తుల గొట్టి శరీరారోగ్యములోను, సర్వ సంపదలతోను, దరిజేరగలరనుటకు సందియములేదు. శ్రీ నృసింహస్వామి సన్నిధికెదురుగా సప్తరుషుల శిలా విగ్రహములుగలవు. ఋషులు అంజలిబద్ధులై శ్రీవార్లకెదురుగా శాంత మూ ర్తులవలె ప్రకాశించుచున్నారు. యీ సప్తఋషులు తపో బలిమిచేతనే యీ స్తలము దివ్య క్షేత్రముగా యేర్పడు టకు కారణమైనది. మరియు చిన్నకొండపైన గోపురప్రాకార మంటపములతోను ఆంజనేయులవారి దేవాళయముగలదు. అచ్చట యోగాసనాసీనుండయి ఆంజనేయులవారు చతుర్భుజ ములుగలిగి, రెండుహస్తములలో శంకుచక్రములు ధరియిం చుకొని ఒక హస్తమునందు జపమాలాధరుడయి, ఒకహ స్తముతో జపసంఖ్యలెక్కించుతూ, యోగదృష్టితో జపము జేయుచూ, ఆంజనేయులవారు దివ్యసుందరమూర్తియై గులాభి మల్లెసంపంగి నీలాంబర పుష్పములతోను మాలలుధరించుకొని

దివ్యమూర్తియై వేంచేశినారు. యీ భరతఖండమున యెక్క-డకూడా ఆంజనేయులవారికి చతుర్భుజములున్నూ యోగాసనమున్నూ యేక్షేత్రములోకాని యిట్టిమూర్తి వేంచేయలేదు. శ్రీవారు యీవిధముగా వేంచేయుటకు కారణములు ముందు రాబోవుచున్నది. ఈ సన్నిధిప్రక్క-ననే మరొకసన్నిధిలో సీతా రామలక్ష్మణ చక్రపెరుమాళ్లున్నూ ఆదిశేషతల్పముపై ఆనందముగా పవ్వళించిన శ్రీరంగనాథులున్నూ వేంచేశియున్నారు. యిచ్చట సీతారామలక్ష్మణులు వేంచేయుటకు కారణము కూడా కథాసంగ్రహములో తెలియును. మహానుభావులు కొందఱు పెద్దలు తెలియచేయడములో యీస్థలమహాత్యమును బట్టి ఋషాద్యులు పూర్వము పండ్రెండవ కృతయుగమునందు యాగాది యజ్ఞముల హోమములు చేయుచుండినప్పుడు, రాక్షస సమూహముయెక్కు-వగావుండి, రాక్షసులు ఋషాద్యులు చేయు తపస్సులను భిన్నముచేస్తూ యజ్ఞశాలలు చెదరగొట్టుతూ హోమగుండములందు మలమూత్ర దుర్గంధములతో అగ్నిహోత్రములను అణచివేయుచూ ఋషాద్యులను బట్టి హింసించుతూ, ఇట్లనేక రాక్షసభాధలతో తాళజాలక సప్తఋషులు శ్రీమన్నారాయణ మూర్తిని గురించి అనేకవిధముల ప్రార్థించగా శ్రీమహావిష్ణువు సూర్యకిరణ కాంతులతోడను శంకుచక్రగదాపద్మధరుడై పీతాంబరధారియై నీలవర్ణుడై సాక్షాత్క-రించినంతట ఋషాద్యులు నమోనారాయణ పాహి పాహి మమ్మురక్షించువారెవ్వరు. దీనరక్షకామూకుదిక్కె-వ్వరు యీరాక్షసులభాధచేత మాతపములు ఫలించుటలేదు. మా

యజ్ఞములు జరగడములేదు. మాహోమములు వెలగడము లేదు. యెందు వాసముచేయుదమన్నను అందురాక్షసులబాధలే యున్నవి. దీనరక్షకా! మాకేదిగతియని అనేకవిధముల శ్రీమన్ నారాయణుని ప్రార్థించివేడగా స్వామిచిరునవ్వునవ్వి మందస్మిత ముచేసి అమృతవాక్కుచే భక్తాదులారా భయమొందకుడు రాక్షసులమదమణుగుటకు కాలముసమీపించినదిలేదు. రాక్ష సుల దుండగములన్నియును నాలీలలు జగత్ లీలలోలుడని నాకు బిరుదుగలదు. సర్వమునామాయచే సృష్టింపబడి లీలా వినోదుడనుగాన రాక్షసుల రక్షించినవాడను. నేను రాక్షసుల, శిక్షించువాడను నేనేసృష్టించువాడను నేనే భక్తుల పాలించు వాడను. నేనే భక్తుల కష్టములు పెట్టువాడను. నేనే భక్తుల పాలించువాడను నేనే నాలీలలు అనంతములయియున్నవి. సర్వ నామములు నాకుజెందినవి. సర్వపూజలున్ను, గూడినవి సర్వ దేవతారాధనలున్ను నన్ను గూడినవి, ఎవ్వరెవ్వరు ఏఏ నామము తో యేయేస్వరూపముతో పూజింతురో, ఆయారూపములతో ను ఆయానామములతోను ప్రసన్నుడనై, భక్తుల మనోరథముల నెరవేర్చుచుండెదను. సర్వవ్యాపినై సర్వజనసంచారుండనై సర్వశరీరధారుడనై సర్వము నేనుగా వున్నందున, నాకు రూప నామక్రియ లెంతమాత్రము లేవు. కారణములబట్టి, కథా సంగ్రము కొరకై లోకనటనకై యీరీతి యెవ్వరెవ్వరు, యే యేవాంఛతో యేనామముతో హృదయశుద్ధితో స్తుతించెద రో వారికి ఇట్టిరూపముతో వారెట్టి రూపముతో పూజింతు రో అట్టిరూపముతో ప్రసన్నుడనై, అండ పిండ బ్రహ్మాండ

ములకు నాయకకుడనై యీరీతి కపటనాటకములు జరిగించుచుందును. అందునుంచినన్ను కడపట నాటకసూత్రధారుడని బలుకు చుందురుగాన, భీతినొందకుడు. నేను ఉత్తరదిశయందు అహోబలంబున ప్రహ్లాదుడను బాలభక్తుని రక్షించుటకై అందనతారమెత్తి సింహరూపముతో యిక్కడికివచ్చి రాక్షసులను జించి చెండాడి, నా మనోరథములను నెరవేరునట్లు ప్రసాదించెదను. నిర్భయులై యుండుడని అంతర్ధానుండై అహోబళ క్షేత్రమునందు ఉక్కుస్తంభము నందు ఉగ్రహ నరసింహరూపుండై ఉదయించి హూంకరించుతూ హిరణ్యకశిపుని జీల్చి, ప్రహ్లాదుని మాటదక్కించి రక్షించి ఆరౌద్రభీకరాకారముతో హుంకరించుతూ యీఘటికాచల పర్వతమునకు వేంచేశి పోరుచేయుచుండిన రాక్షసవీరులను జించిచెండాడి నోటరక్తము ప్రవహించుచుండ నేత్రము గ్రుడ్లు యెర్రనై అగ్నిముద్దలవలె జ్వాలలు పుట్టుచుండ, నాలుక వక్షస్థలము వ్రేలాడుచుండ, అండపిండ బ్రహ్మాండ మంతయు గడగడ వణకుచుండ యీ భీకరమూర్తిని శాంతింపజేయుటకై ప్రహ్లాద నారదాది మహామునులున్నూ, శ్రీలక్ష్మీదేవి యు వేంచేసి శ్రీవారి ఉగ్ర మనుచుటకు గతంబేమని సమీపము నకుబోయి శ్రీవారియెదుటనిలచి ప్రార్థించుటకుకూడా, ధైర్యము జాలకుండినంత ప్రహ్లాదుండు నిర్భీతుడై భక్తుడై, అనేకవిధముల బాలుండు ప్రార్థించినంత శాంతమూర్తియై ఋషాదులను బిలచి నేను యోగములో యీపర్వతమునందే గూర్చుండెదను. కలియుగము బుట్టి కృతయుగ ధర్మమును నడి

పించ యోగ నారసింహుడను నామముతో నేనీస్థలములోనే నుండెదను. యిక మీ యాగములను యేభీతిలేక జరిగించు కొమ్మనిన లోకరక్షకా దుష్టశిక్షకా శ్రీవారిని నుతింప మాత రముకాదు. ప్రభూ మీరు యోగములో గూర్చున్న, మా యాగములు మాహోమములు నెరవేరుట కష్టము. యేప్రక్క నజూచినను రాక్షసుల సంఖ్యయెక్కువగా యున్నది. యా గాది యజ్ఞ హోమములు ప్రారంభించిన పిమ్మట, యేదిక్కు నుండి యేరాక్షస సమూహము వచ్చి పడునోయని భీతిపడుచు న్నాము. దేవరవారు కటాక్షించి ఏమి ప్రసాదించెదరోయ నిన శ్రీవారు భక్తుల మొరఆలకించు భక్తవత్సలుడు గాన, గరుడాళ్వార్లను రప్పించి భక్తా హిమవత్పర్వతమునందు ఒక బిలంబులో, ఆంజనేయుల వారున్నారు. వారిని శీఘ్రమే యి చ్చటికి తోడ్తెమ్మనిన దేవా మరెట్టికార్యమునైన జేయసంసి ద్ధుడను కానియీ ఆంజనేయుల వారివద్దకు వెళ్లుటకు భీతిపడు చున్నాడను. గతద్వాపరాంతమున, మీరు కృష్ణావతార మెత్తినపుడు, వారివద్దకువెళ్ళి నాశరీర శల్యములన్నియు చూ ర్ణమై నా రెక్కల యీకలన్నియు వూడి నానావిధముల పరా భవముపొంది మరి మీకటాక్షముచే యింతవరకు బ్రతికివుం టిని, యిప్పటికిన్నీ ఆనాడుతాకిన ముష్టిఘాతమగు దెబ్బల గురుతులు యింకను గురుతులుగా యేర్పడియే యున్నవని విన్నవించిన భక్తా ఇట్లుచెప్పుము శ్రీమన్ నారాయణమూర్తి నృసింహావతారమెత్తి నిన్ను తోడ్తెమ్మనెనని తెలియజేయుము. శీఘ్రమెపొమ్మని శలవొసంగిన, అంతట గరుడుండు పక్షిరాజు

గాన తత్క్షణమే పైకెగిరిపోయి హిమవత్పర్వత బిలము బయట నిలచి॥ పూర్వము అనుభవించిన వాడయినదానివల్ల భయము తో వడకుతూ రామ రామ రామ సీతా యనీ రామనామ ముతో భజనచేయుచుండిన రామనామము శ్రవణముల సోక గానే ఆనందమాడుతూ బిలమునుండిబయలుదేరి గరుడాళ్వార్ల వద్దకు ఆనందముతో నాట్యమాడుతూ ఆంజనేయులవారురాగా రామనామము నిలిపి దేవా ఆంజనేయా నేను గరుడుఁడను వాడను. శ్రీమన్నారాయణమూర్తి నరసింహావతారమెత్తి మిమ్ము శీగ్రమే తోడ్తెమ్మనెనని తెలియజేసి నంతమాత్రానవే ఆంజనేయుండు ఒక పాదము ముందుకుబెట్టి, వాలము చేత బట్టుచుండగానే గరుడుండు భయంబొంది, గగనంబున కెగిరి పాహి పాహియనుచూ, తత్తరపాటుతో భయకంపితుడై శ్రీ నృసింహస్వామివద్దకు వచ్చినిలచి దేవా బ్రతికివస్తినని జరిగిన వృత్తాంతము విన్నవించెను. అటులయిన నేను రామావతార మెత్తి సీతాలక్ష్మణ సమేతుడనై నిల్చియుండెదను. మరినీవు వెళ్లి శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతుడైయుండి నిన్ను శీగ్రమే తోడ్తెమ్మని నాడని జెప్పుము. తోడనే రాగలడని యానతిచ్చిన ధైర్యముగలిగి యిక్కడనుండియే, రామరామ యనుచూ హిమవద్గిరి బిలము సమీపమున నిలిచి మునుపటి వలెనే రామనామ భజన జేయుచుండగా బిలమునుండి ఆంజనే యులువారు వేంచేయగా, దేవా ఆంజనేయా శ్రీరామచం ద్రుండు, శ్రీసీతాలక్ష్మణసమేతుడయి, నిలిచి మిమ్ములనుతోడ్తె మ్మనినాడని తెలియచేయగానే, ఆనందముప్పొంగి ఆతురతతో

గరుత్మంతుని తనభుజముపై నిడుకొని ఆనందముతో వాయు వేగమున ఘటికాద్రి జేర రాగానే నృసింహస్వాములు శ్రీరామ చంద్రులుగాను, ఆదిశేషుడు లక్ష్మణులుగాను, శ్రీలక్ష్మీదేవి సీతాదేవిగాను, యేర్పడి వేంచేశియుండిరి ఆంజనేయులవారు తోడనే వేంచేసి శ్రీవార్లచుట్టు ప్రదక్షణముచేసి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి అంజలి బద్ధుడై, ఆనందభరితుడై నేత్రములనుండి, ఆనంద బాష్పములు రాల్చుచూ, గద్గద స్వరముతో శ్రీవారిని స్తుతించుచూ గంతులువేయుచూ దేవా, యెంతకాలమునకు మీదివ్య సందర్శనము లభించెను. దినము లలోకెల్ల యీదినము కదా సుదినము. యిదేకదా అయో ధ్యానగరము. యిదేకదా త్రేతాయుగము. అని పరిపరి విధ ముల ప్రస్తుతించుచుండగా శ్రీవారు యెడమచేత కోదండమును ధరించినవారై, వామహస్తముసాచి, ఆంజనేయులవారి శిరంబు నందలంకరింపజేసి, ఆంజనేయా నీవెందుండినను నీవద్దనే, నేను న్నాను. నావద్దనే నీవున్నావు. యీస్థల విశేష ప్రభావము వలన, యిందనేక ఋష్యాదులు గలరు. వారితపోబలముల చేతనే నేనీ యవతారమెత్తి మరినీకు దర్శన మొసంగ గలిగితిని. నేను యిక నరసింహరూపమున యిదే స్థలమునందు యోగము లోనుండ బోవుదును. యిందనేక ఋష్యాదులు, తపోనిష్ఠుల యి యజ్ఞహోమ యాగములు జేయుచుండెదరు. యీభాగ మునందనేక దుష్టరాక్షసుల దుండగములచే, ఋష్యాదులను హింసించుచుండెదరు. కలియుగాంతరమున కృతయుగ ధర్మ మునడుచునందాక నీబాహుబలాఢ్యముతో, నీశౌర్య ప్రతాప

ధీరత్వముతో రాక్షసులను జెండాడి రాక్షసుల పోరుమాన్పి, ఋష్యాదుల యాగములను నిర్విఘ్నముగా జరిపించమనిన, దేవా మీరుయిచ్చోటున ప్రత్యక్షముగా వేంచేసియుండిన, మీకటాక్షముచే, యీబ్రహ్మాండమంతయు నాముష్టిఘాతము చే భగుల్ భగుల్ మని, కొండలన్నియు, పిండి పిండిగాగొట్ట మన్నను గొట్టగలను. మీరునాయందు దృష్టివుంచక యోగ దృష్టిలో వేంచేసిన యిప్పట్లో నా రెండు బాహుబలము యీ రాక్షసుల మదమణచుటకు చాలదనిన, అందుకు శ్రీవారు నీ రెండు బాహులయొక్క బలము దాలకున్న నీకు చతుర్భుజ ములుండున్నట్లున్నూ, నాశంకు చక్రములున్నూ, నుండునట్లు న్నూ ప్రసాదించితిని. చక్రధరుడవై నీపరాక్ర తీక్షణముచేత, రాక్షస వర్గమేమాత్రము లేకుండా హతముజేసి, యిదేశంకు చక్రములచేత చతుర్భుజుడవై, నాకెదురుగానుండు చిన్న పర్వ తముపై నీవుకూడా, యోగాసనాసీనుడవై జపములోకూర్చొని, కలియుగంబున ఫలముగోరు భక్తాదులకున్నూ, గ్రహ పిశాచి గాలి దయ్యముల బాధలు నివారణ చేస్తున్నూ వుండ వలెనని సెలవొసంగి శ్రీవారు, తన నరసింహ రూపమును దాల్చి యోగాసనుడై వేంచేసెను. శ్రీమహాలక్ష్మీ దేవిగారు కూడా మన్నాథుని చెంతనే నేనుకూడా యిచ్చోటువేంచేసెదనని దేవిగారుకూడా స్వామిగారి ప్రక్కనవేంచేసెను. యీక్షేత్ర మునందు ఆంజనేయులవారి నిమిత్తమయి నృసింహస్వామి సీ తారామలక్ష్మణ సమేతముగా దర్శన మొసంగినందులకై చిన్న కొండపైన సీతారామలక్ష్మణులు వేంచేసి యుండుటకు కారణ

ము. నృసింహస్వామి కటాక్షముతో రాక్షసుల సంహారణార్థమై యీక్షేత్రమునందు ఆంజనేయులవారు శంకుచక్రధరుడై చతుర్భుజములతో వేంచేసియుండుటకు కారణమయినది. తదుపరి ఆంజనేయులవారు శ్రీనృసింహావతారమును దర్శించి, స్తుతించి శ్రీవారు యోగములో వేంచేసిన పిమ్మట బయలుదేరి చీమల పుట్టలవలె పెళ్లగించుకొని రాక్షస సమూహములు వచ్చుచుండుటచూచి ఆంజనేయుండు, తన వజ్రశరీరమును ఉప్పొంగు లోగున ధృఢకాయసిద్ధుడై, అతిలాఘవముతో కుప్పించి లంఘించి హూంకరించి, రాక్షస సమూహములోజేరి కొల్లలాడుతూ తన పరాక్రమ శౌర్య సాహస భుజభలముచే రాక్షసులను భీతిగొల్పి, నేలంబడ గొట్టుతూ ఈ విధముగా కొద్దికాలము రాక్షసులందరిని జించి చెండాడి రాక్షసులబాధ బొత్తిగా నిలిచిపోయిన పిమ్మట ఋష్యాదులందరు హాయిగా వారి వారి యజ్ఞయాగ హోమములు యే విఘ్నములులేకుండా జరుగుచుండుటజూచి, ఆంజనేయులవారుకూడా యోగములో కూర్చుండుటకుయత్నించి, ఈఘటికాద్రిపర్వతముచుట్టు, మరే రాక్షసుడు కూడా ఈపర్వతమునకు రాకుండుటకు ఈగిరిచుట్టు శ్రీఆంజనేయులవారి బీజాక్షరములతోటి అష్ట దిగ్బంధనజేసి, శ్రీవారు శంకుచక్రధరుడై, యోగాసనమున శాంతమూర్తియై వేంచేసినారు. శ్రీనృసింహస్వామి సన్నిధియెదుట యిప్పటికికూడ సప్తఋషుల శిలా విగ్రహములున్నవి. యీసప్త ఋషులకు తిరుమంజనం వగైరా కైంకర్యములుజరుగుచుండును. భక్తాదులు నృసింహస్వామికి శుక్రవారము తప్ప తక్కినరోజులలో

తిరుమంజనం జరిగించినయెడల యీసప్త ఋషులకు తిరుమంజనం జరుగుచుండును. శ్రీవార్లకు శుక్రవారం తప్ప తక్కిన రోజులలో తిరుమంజనములేదు. ఆదివారమురోజున చిన్నకొండపైన ఆంజనేయులవారికి అనేక భక్తాదులతోను మంగళవాద్యములతోను గోవింద శబ్దములతోను, మహావైభవముగా తిరుమంజనంసేవజరుగును. ఆదివారముగోజున గాలి పిశాచములుండిన ఆడవారికిన్ని మొగవారికిన్నీ వారి వారి ఒంటిపైకి గ్రహములునచ్చి విశేషముగాఆడుచుండును. యీగిరి ఆభరణంలో పల రోజాపుష్పముల చెట్లతోను చామంతి మల్లె మొల్లల నీలాంబర మొదలగు గంధ సుగంధ పరిమళమైన అనేక పుష్పతోటలతోను ప్రబలియున్నవి. ఈతోటలనుండి కొందరు భక్తాదులు స్నానమాచరించి స్వరూపధరులయి తోటలకువెళ్లి పుష్పములుగోసి ఒకమరుగుస్థలమున భాగవతులందురు ఆపుష్పములను ఒక స్థలమునందుంచి నిండు భక్తినిష్టతో శ్రీవార్లకు అలంకార చిత్రములతో పుష్పమాలలు గట్టుకొని శ్రీవార్ల సన్నిధికి వెళ్లి శ్రీవార్లకు పుష్పమాలలు సమర్పించివచ్చుచుందురు. యీప్రకారము అనేకభక్తులు అదేపనిగా తోటలు ప్రబలపరచి పుష్పకైంకర్యము నిమిత్తమై యీ క్షేత్రమునందు యీరీతిగా జరిగించుతూ దైవకృపకై స్వంతఖర్చులతో అనేకులు యిచ్చటనే నివాసముగా యుంటూయున్నారు. మరియు యీ పర్వతమునందు కొండముచ్చులును వానర సమూహములున్నూ మర్కట సమూహములున్నూ నా నా విధవృక్షములచేతనున్నూ అనేక పుణ్యతీర్థ కొలనులచేతనున్నూ గోవింద శబ్దముల

తోడను, ఘంటానాదములతోడనున్నూ, చిత్ర విచిత్ర ధర్మ ఛత్రముల చేతనున్నూ భజన మంటపముల చేతనున్నూ స్వరూపానంద భాగవతుల నివాసనములతోడనున్నూ వైష్ణవోత్తములచేతనున్నూ యిదే కలియుగ వైకుంఠంబనుటకు యే సందేహము లేకుండా ప్రసిద్ధి జెందియున్నది. క్షేత్ర మహిమను మహామభావులగు పెద్దలు చెప్పడమే గాకుండా నా అనుభవములో సర్వము సేవించి ఆయా దృష్టాంతర ములనుజూచి బ్రంహ్మానందమును జెంది, గడచిన మాఘ శుద్ధ పౌర్ణమి, గ్రహణ కాలముగా నున్నందున యిచ్చట నుండు పాండవ తీర్థమునందు కూర్చొని శ్రీవారు ప్రసా దించిన మంత్రార్థములుగల జపము చేయుచుండగా సుమారు రాత్రి 10 గంటలకాలమందు నాదృష్టికి యీ క్షేత్రనాథుని అద్భుతాకార, సందర్శనములున్నూ ఋషాృదులు జడదారు లయి కపుపీనధారులయి సంచారముచేయు లీలలున్నూ, గొప్ప గొప్ప వాసరములను, శ్రీవారి లీలావినోదములను జా గ్రతావస్థలోనే నాదృష్టికి గోచరించినదిగని, మరి నా స్తానము నకు నేనువచ్చి నాకుటీరమును భద్రపరచి, అదేరాత్రి సుమారు 1 గంటకాలమందు ఏంకాంగినై జపమాలతో జపముజేసు కుంటూ పెద్ద పర్వతమునెక్కి దేవస్థాన మహాద్వారముక్రింద కూర్చొని నిండు వెన్నెలగానున్నందున నేత్రదృష్టితోగగనంబు నకు యెందునిమిత్తమో తదేకదృష్టితో నక్షత్రములనుచూచు చుండగా అంతర్మధ్యమునుండి కొందరు తటాలున వేంచేసి వచ్చినట్లున్నూ నరసింహాగుంట తీర్థముగట్టున సుమారు 10 12 మంది మూర్తులు ఆ గంగలో స్నానమాడినట్లున్నూ, ఈ

వింతగల అద్భుతమును వెన్నెల వెలుగులో దిగ్భ్రమజెంది చూచుచుండగా నేనున్న స్థలమువెనుక అనేకమంది భక్తాదులు గూడి ఒక్కే గోవిందశబ్దము పెట్టినట్లు గోవిందా, గోవింద యని 3, 4 దపాలుగా గోవింద శబ్దములువింటూనే నాశరీర మంతనుండు రోమములు సూదిమొనలవలె లేచి పులకాంతశరీరుడనై, వెనుకకు మరలితిరిగి చూస్తూయుండగా నేనున్నచోటికి అర ఫర్లాంగుదూరములో జన సమూహాముప్రుండినట్లున్నా, వారు ఏమో మాట్ల లాడినట్లున్నా, గోచరించి తదుపరి వెంటనే తొలకరించునపుడు మెరుపు మెరసినట్లు ఒక గొప్ప మెరుపు అచ్చటనే మెరసెను. మరి ఎవ్వరు కానరారైరి. దూరదృష్టిలో నేనున్నదానివల్ల యిట్టివారు ఇంత పొడుగు అని చెప్పుటకు వీలులేదు. మరెందుచూచినను ఏ విశేషముగానన్నైతిని. ఆ రోజురాత్రి చలియెక్కువగా వున్నదానివల్ల వణకుతో అట్లనే నిలిచి చూచుచుండగా, కొండక్రిందనుంచి, చలికి యెందుకు నిలిచినావు నీ స్థలమునకు నీవెళ్లి పండుకొనుము, అని ఒక గట్టికేకవినవచ్చెను. ఆ కేక వినిన పిమ్మట, నా ధైర్యముచెదరి భీతిపుట్టి ముందు కాలుపెట్టుటకు కూడా ధైర్యముచాలక అట్లనే కండ్లు మూసుకొని కూర్చొని శ్రీవార్లను అనేకవిధములు ప్రార్థించుకుంటూ భయము జెందుతూ వుండగా అప్పుడే నాకు ఒకవిధమైన మయికము కలిగినది. ఆమత్తు నాకు నిద్రవలె తోచినది. ఆమత్తు నిద్రలోనే శ్రీవారు ఒక భక్తుని రూపముతో నల్లని శరీరముగల వాడై స్వరూపమును ధరించుకొని నా వీపుపైన హస్తము

వుంచి భయపడకుము నేనున్న స్థలములోకూడా నీకు భయము గలదా యని కొన్ని ఆజ్ఞలనుయిచ్చి యీ ఆజ్ఞ రహస్యము లను బయలుపెట్టవద్దని, చలికి ఒక శాలువ నాకు కప్పగా నాకు మెలకువకలిగినది. కన్నులు తెరచిచూడగా యేమి అగుపడలేదు. నాకు భయమనునదిలేచక నిండా చురుకుదన మున్నూ, శరీరమంతయు వెచ్చదనముచేతనున్నూ, హాయిగా చలికూడా యేమాత్రంలేకుండా వుండుటచూచి నాలో నేను ఆనందించి ద్వారమునకు నమస్కరించి, ప్రభూ, నీ అద్భుత, లీలలు కడపపురంబునందును, పండరీక్షేత్రమునందును, సింహా చల కొండయందును, అనేకముగా నీ లీలలనుగాంచి యుండి కూడా యీ సమయములో నీ ప్రేరేపణచేతనే అగస్మాత్తుగా యిందు రాగలిగినవాడనై నీకృపగంటినని శ్రీవారిని స్తుతించు కొని అత్యానందభరితుడనై, యే భీతియులేక అతివేగముగా వచ్చి నా స్తానమునజేరుకొంటిని. అప్పటినుండియు, శ్రీ వారి దివ్య సందర్శనములున్నూ, అమృత వాక్కులున్నూ, అనేక దృష్టాంతరములు కలుగుతూ వున్నను, దైవ రహస్యములను వెల్లడిచేయుటకు దైవాజ్ఞ లేనందున వ్రాయుటకు వీలులేదు. యీ క్షేత్ర మహాత్యమునుబట్టిన్నీ, శ్రీవారి అద్భుత సందర్శ నలుగల అమృతవాక్కులుగల ఆజ్ఞలున్నూ, యీ కలియుగ మున యీ ఘటికాద్రి క్షేత్రమునందు నావంటి భక్తిహీనుడు గల నిర్భాగ్యునకే, యిట్టి దివ్యదర్శనములనొసంగి అనేక ఆజ్ఞ లను నొసంగుతూ, అద్భుతములు చూపి ఆనందింపజేసిన భక్తాగ్రేసరులకున్నూ, నిష్టా గరిష్టులకున్నూ, పుణ్యమూర్తు

లకు జ్ఞానభక్తి గల మహానుభావులకు యెటువంటి కృపాకటాక్ష ము జూపుచున్నారో కదాయని యీక్షేత్రమహాత్మ్యము కొంత వరకు వ్రాయగలిగితిని. యీ పర్వతమునందుండు పావనమైన గంగాకోనులు 108 గలవనియందురు కొన్ని కోలనుల నామ ములు మాత్రం తెలిపియున్నాను. నేనన్ని కోలనులను దర్శించి స్నానమాచరించి యుండలేదు. కొన్ని తీర్థాలలోమాత్రం స్నాన మాచరించగలిగితిని. యీ గంగతీర్థములలో భక్తితో స్నానమాచరించినవారి సర్వ పాపములు హరించి, సర్వపీడలు తొలగి సర్వసుఖములను తప్పక అనుభవించెదరని పెద్దలు చెప్పడమే గాక నా అనుభవములో నేను వారికంటె యెక్కు వగా ధృఢముగా జెప్పగలను. యీక్షేత్రనాధుని కృపబడయు టకై మహానుభావులగు అనేకులు తల్లితండ్రులు త్యాగ భక్తి తో శాంత చిత్తులయి, భూత దయాపరులయి, దాన ధర్మ ములతో భూత, తృప్తి యొనర్చుచూ, శ్రీవారి సేవ జేయుచూ, యిట్టివారికి శ్రీవారు కటాక్షించే ప్రసాదము లున్నూ, ఫలములున్నూ దివ్య దర్శనములున్నూ నొసంగి భక్తాదులగు సేవచేసినవారికి వారి వారి స్థానములకు వారి వారి కోరికెలు నెరవేర్చి శ్రీవార్లు బంపివేయుచున్నారు. యీ క్షేత్రమునందు మరి కొందరు పుణ్యమూర్తులగు తండ్రులు యీక్షేత్రమునందు వాసముచేస్తూ సేవార్థులకు యేవేవో గ్రంథ ములు జదివి చెప్పుతూ, నాకే కాంక్షయు వలదనిన్నీ, నేను నిష్కామ భక్తుడననిన్నీ, అనేకనీతులు సేవార్థులకు బోధన జేస్తూ (అనిత్యానీ, శరీరానీ) అన యీశరీరము నిత్యమయి నది కాదు అని బయటికిమాత్రం పలుకుచెప్పుతూ భావన

యందు మాత్రం (అందరిసొమ్ములు నాకేరానీ) యని మనం బున నుంచుకొన (గోముఖ వ్యాఘ్రములవలె సంచరించుతూ,) (సేవకై వచ్చిన దాసభక్తులను తిరస్కరించుతూ, ఓర్పులేని తన మున రోమవేవో దాసులను తప్పులుబట్టి చెప్పకుంటూ,)(తప్పు లెన్నువారు తమతప్పు లెరుగరని) వారితప్పులు వారికే తెలి యక, దాసుల దోషములను దాసుల పాపములు నివర్తి చేయు టకై శ్రీవారే యిట్టివారిని యీక్షేత్రమునకు రప్పించుకొని, దాస భక్తులను ధన్యులనుగాజేసి పంపుచున్నారు. గాన, సేవ జేయవచ్చిన దాస భక్తులెల్లరును యిట్టివారు ఓర్పులేని తన మున ఏమి దూషించినను, ఏమిహేళనచేసినను, మీరు మరు మాటాడకుండా, మాఖర్మ నివర్తికై, శ్రీవార్లు యీలాగున పలికించిన మన శరీరముపై మయిలను సబ్బుబిల్లలచే మనము మైలను పోగొట్టుకొనినట్లు, సబ్బుబిల్లలరీతిగా యీ మహాను భావుల (నాలుకల) తో మన ఖర్మరాసిని నాకించుచున్నాడని ధృఢముగాదలచి ఆనందించవలయును. లోకములో పుణ్య క్షేత్రము లెక్కడెక్కడుండునో, ఆక్షేత్రనిధుల గంగాభవాని పాచి గుడ్డలతోను, పచ్చనివర్ణముతో గంగయుండును. తేట గంగగాయుండుట అరుదు. ఆలాగే యిటువంటి పుణ్యక్షేత్ర ములందు కూడా, యిట్టి మహానుభావులుండి భక్తాదులు తిర స్కరించి దూషించనిదే, భక్తాదులు తరించడమునకు కష్టము. యిట్టి మహానుభావులకు యిట్టి గ్రంథములు చూచినను, చదు వుచుండినను చాలా అసహ్యపడి అపహాస్యము చేయుచుం దురు. యిటువంటి తంద్రులు యీగ్రంథమును తిరస్కరించి

హేళనచేయడముకూడా, యీ గ్రంథములో నేను అల్పవిద్యా వంతుడనైన దానివల్ల అనేక తప్పిదములుండును. ఆ తప్పిద దోషములుకూడా నాకేమాత్రము అంటక వారికే జెందిన, గ్రంథ దోషముకూడా నివర్తి యగును. తల్లి తండ్రులారా! యీ క్షేత్ర మహాత్యము యెదో నేర్చి నేర్వని 4 మాటలతో వ్రాసితినిగాన సంతాన హీనులున్నూ, గాలి గ్రహ దయ్యాల రోగబాధలచే వ్యాకులతపడువారును, వ్యవహార చిక్కులతో యేదిక్కు దోచక కంపాయమానము బట్టినవారును, యీ క్షేత్రమున వసించి ప్రక్కన దెలిపించిన సేవపద్ధతులప్రకారం శ్రీ వార్ల సేవభక్తి శ్రద్ధలతో సేవచేసిన శ్రీ లక్ష్మి నారసింహస్వా ముల దివ్యసందర్శనములున్నూ, శ్రీ అమృతవల్లి తాయారు లగు శ్రీలక్ష్మి దేవిగారి సందర్శనభాగ్యమున్నూ, ఆంజనేయుల వారి ప్రత్యక్ష సందర్శనములతో మీ స్వప్నములందు సాక్షా త్కరించి మీ యభీష్టములకు ఏకొరతలు లేకుండా అమృత వాక్కులతో ఆజ్ఞయిచ్చి ఇహపరములయందు ఖండితముగా శాశ్వితపదవులు బ్రహ్మానందముతో, యీ క్షేత్రసేవచేసిన వార లకు తప్పక ఫలములు సిద్ధించునని నమ్మకముగా చెప్పు చున్నాను.

ఇది దైవాజ్ఞ,

పండరీభక్త ఎ. నారాయణదాసు.

ఫలముగోరు సేవార్థులు సేవచేయుపద్ధతులు.

యీ క్షేత్రమునందు వసియించి శ్రీవార్ల సేవచేసి కృ తార్థులగు తల్లి తండ్రులకు వినయ పూర్వకముగా నేసాష్టాంగ వందనము లాచరించి విన్నవించు కొన్న విజ్ఞాపన.

గ్రహపీడ పిశాచ బాధలుండు వారును, సంతాన ప్రాప్తికై పరితాపము నొందువారును, దుష్కర్మ బలముచే రోగబాధలుండు వారును, వ్యవహార చిక్కులచే ధనకాంక్షకై మనో వ్యాకులత పడువారును, యీ క్షేత్రమునందు వసించి నిశ్చలమయిన దృఢభక్తితోను, ఒకే వైరాగ్యము తోడను, ఓపికతోడను, శాంతముతోను, వుపవాసనలతోను, నిష్టాగరిష్ఠులయి, నిండు భయభక్తులయి, శక్తి కొలది భూతతృప్తి చేయుచూ, ధర్మ వర్తనలతో ప్రవర్తించుచూ సదా శ్రీవారిని మనంబునందు ధ్యానించుకొంటూ ప్రభూ నీకృపాకటాక్షము జూపువరకు నీపాద సన్నిధియందు సేవచేస్తూ నీదాపుజేరియుండవలెనని దాసదాసులమై మీామరుగు జేరియున్నామని ధ్యానించుతూ యీావిధముగా సేవచేయు సేవార్థులు యీాక్షేత్రమున వసించి యధాశక్తి కొలది శ్రీవారికి కైంకర్యములు జరిగించుతూ త్యాగభక్తి గలిగి శ్రీవారియందే మనస్సును లీనంచేశి, సేవచేయుచూ శీఘ్రములోనే శ్రీవారి అనుజ్ఞ బడసి శ్రీవారి ఉత్తర్వుతో బ్రంహ్మానందము జెంది వారివారి స్థానములకువెళ్ళి సుఖానందముతో సర్వసుఖములతో సుఖించుచున్నారు. అట్టి సేవచేయు తల్లులు తండ్రులు అనేకులు ఇప్పటికి నీసేవచేస్తూ యీా క్షేత్రంబున నివసించు చున్నారు. యీాక్షేత్రమునందు నేనుండినప్పుడే అలాగువ సేవచేశిన తల్లి తండ్రులకు వుత్తరువై వారివారి స్వస్థానములకు వెళ్ళినవారినెందరినో నేనుకూడా చూడగలిగితిని. మరికొందరిని సేవార్థులనుకూడా చూడగలిగితిని. కొందరు తల్లితండ్రులు మేముసేవ

చేయుచున్నామని యీ క్షేత్రమునందు వసించుతూ వుదయం పూట తీర్థస్నానాదులకు వెళ్లితే ముందుగా సబ్బుబిళ్ళలు మాత్రం మరువకుండా తీర్థగుంటలవద్దకు వెళ్ళడం, అక్కడస్నానం చేయడం ముఖము బాగా మెరుగెక్కవలయునని ½ గంటసేపు దిద్దుకోవడము, మరిమంచి వుడుపులతో అలంకారము చేసుకోవడమున్నూ, యికసేవకు వెళ్ళవలయునని, సువాసనగల సబ్బుబిళ్ళల వాసనలతో ఒక బుట్టలో పసుపుకొమ్ములు వేసుకొని చంక పెట్టుకొని అశ్వర్థనారాయణ వృక్షములుండిన నాగల వద్దకువచ్చి బుట్టని ఒకస్తలమందు వుంచి 108 ప్రదక్షిణాలు త్వరగా జేసుకొని కొండయెక్కవలయును. కుమ్మరసాన తిరిగినట్లు ఒకరికొకరు మాట్లాడు కొంటూ వకరికొకరు తోసుకుంటూ దిక్కులుచూచుకుంటూ, యీచుట్లు యింకా ఎన్ని రోజులు చుట్టవలయునో అని మనంబులో అను కుంటూ పసుపు కొమ్ములు మాత్రం లెక్కగా బడవేసికుంటూ 108 చుట్లు నాగల ప్రదక్షిణము అయినపిమ్మట మరి కొండ ఎక్కడములో, ఒకరికొకరు మాట్లాడు కొనడములో, లోకాభిరామాయణములతోను ముచ్చట్లతోను, గృహకృత్యముల వంట పదార్థములు వండిన విషయములున్నూ, తమాషాగా మాట్లాడుకుంటూ సన్నిధి జేరినపిమ్మట, అశ్వర్థ నారాయణ నాగల కట్టకు తిరిగిన ప్రదక్షిణముల కంటె ఇచ్చట కొంత స్పీడు జాస్తిగానే వుండినను, యిక్కడ ఒక విశేషముగలదు. నాగల ప్రదక్షిణము చేయునపుడు మాత్రం భూదేవి భయపడి ధమ ధమ మను ధ్వనితో దుఃఖించదు. ఆంజనేయులవారి సన్నిధి

యందును నృసింహస్వామి సన్నిధియందును, బండ పరుపులు గావున్నదాని వల్ల, కొందఱు తల్లులు శేవచేయుచుండిన, భూమి ధమధమమను ధ్వనియెుక్కవలయి ధీరుండగు యోగాంజనేయులు వారుకూడా యోగజపము చాలించి, యిటువంటి ధ్వని త్రేతాయుగమున సముద్రముపై వారధి గట్టునపుడు, కొండలు కొండలుగా జలరాశిలో పడవేసినప్పుడు కలిగిన శబ్ధము యీయుగములో వున్నదేయని శ్రీవారుకూడా ఆనందం జెంది యీ ధమధమ మను శబ్దముతో రంకుల రాటము తిరిగినట్లు ప్రదక్షిణము చేయుచున్న సేవార్థుల చూచి బ్రంహ్మానందముజెంది చూచుచుండును. యీప్రకారం అచ్చట 108 ప్రదక్షిణలు చేసిమాని తీర్థము పుచ్చుకొనడమున్నూ, వెంటనే కొండదిగడములో దిగుడుగా నున్నందున, పందెపు సవారి గుర్రములవలె ఆంజనేయులవారు వాయువేగమున సముద్రంబు దాటినట్లు మహాతల్లులు కొందఱు 2 నిమిషములలో దిగిరావడమున్నూ, వారివారి స్తానములకు వచ్చి భోగ్యముగా భోజనం చేయుడమున్నూ, మరి'పచ్చీసు' ఆటలతోకాని తమాషాగల నవ్వులాట మాటలతోకాని, పరిహాసములతో కాని, లేక ఏకారణములచేతనో, తగువులాడు కుంటూకాని, సాయంత్రం 3 గంటల వరకు యీప్రకారం పొద్దుపుచ్చి, మరి సాయంత్రసేవచేయవలయునని యధాప్రకారంవెళ్ళడము, సాయంత్రం 5 గంటలకు రావడము. రాత్రికి సేవచేశిన వారికి భోజనం లేదని నందున, వుపవాసన అని వుప్పుపిండి పూరి పాయసములు వడలు దోసెలు యిటువంటి వంట పదార్థములు దిట్టముగా

భోజనము చేయుడం కడుపుపట్టి నంతమట్టుకు పాలుత్రాగడం, రెట్టలావు తేపులు తేపుకుంటూ సత్రములలో నుండి బయ టికిరాగా యెవరైన అచ్చటనుండ బడినవారు యేమండీ భోజ్నం చేస్తిరా అని అడిగిన మాకు భోజనం యెక్కడిదండీ వట్టి ఫలహారము మాత్రమే అని చెప్పుచుందురు. తదుపరి మెత్తని పరుపులు వేసుకొనడము తలగడలు బాగా సవరించు కొని పండుకొని కండ్లు మూసుకొని యింకాయెన్ని రోజులకు స్వామివుత్తర్వు ఇచ్చునో అని చింతించుతూ, తిరిగి తిరిగి కాళ్ళువాచిపోతూ వున్నవని అనుకుంటూ యింక 7 రోజులు చూచి స్వామి ఆజ్ఞ యివ్వకుంటె యింటికి వెళ్ళుదామని తల చుకుంటూ నిద్రపోవడం. యీరీతిగా సేవచేయుచూ 4-5 మాసముల వరకు స్వామికటాక్షము యే దర్శనముకూడా లేక విసుగుతో బయలుదేరి వెళ్లిన తల్లితండ్రులను కూడా ఇచ్చట చూస్తిని. యిప్పట్లోకూడా అనేకులు తల్లులు తండ్రులు భయ భక్తులయి ముందు తెలిపించినరీతిగా శ్రద్ధతో సేవచేయుచున్న వారిని చూచి బ్రంహ్మానంద మవుతూ యున్నది. ఆలాటి సే వలుచేస్తూ మేము 6 మాసములనుండి సేవచేయుచున్నామనిన్నీ స్వామివమిన్ని అనుజ్ఞయివ్వలేదనిన్నీ విసుగుపడితే స్వామియెట్లు అనుజ్ఞ యిచ్చునో తెలియదు. కొందరు మేము 1 మండలము సేవజేసెదమనిన్నీ మరికొందరు ½ మండలము సేవజేసెదమనిన్నీ, వుత్తర్వు అయితే ర్పు 2 లు ఖర్చుపెట్టి తిరుమంజనం చేసెద మనిన్నీ, అర్చన చేసెదమనిన్నీ ప్రార్థించి సేవచేసెదరు. లోక ములో శ్రీవారికి యెవ్వరు సేవచేసేవారు లేక మిమ్ములు కోర

లేదు. ఝ్ప 2 లు తిరుమంజనం నిమిత్తమై నోరు తెరుచుకొని స్వామి యెదురుచూడలేదు. భక్తరత్నములగు సేవచేయు తల్లి తండ్రులారా! సేవకుప్రారంభించే టప్పుడు యిన్నిరోజులు సేవ అని నిర్ణయము పెట్టరాదు. సేవకు ప్రారంభించినది మొదలు కొని శ్రీవారికి మీ శక్తి వంచన లేకుండా తిరుమంజనములు చేయించుతూ తళియలు వేయించుతూ అర్చనలు చేయిస్తూ శ్రీవారికి వస్త్రాలంకారములు చేయించుతూ బ్రాహ్మ ణులకున్నూ, అన్నాతురతగల బీద నారాయణులకు భూత తృప్తి యొనర్చుతూ అనుదినము వుదయం సాయంత్రం వానర స్వాముల సైన్యమునకు మీ శక్తి కొలది వంటపదార్థ ములు కాని ఫలాదులుకాని నొసంగుతూ గుడి అర్చకస్వా ముల పాద సందర్శనముచేసి వారి మంగళా శాసనము బడ యుచూ భయభక్తులయి అను దినము తీర్థగుంటల యందు నబ్బుబిళ్ళలతో మీశరీరముపైన మురికిని బోగొట్టుకొన్నట్లు మీయొక్క హృదయములను దైవభక్తిచేత హృదయ శుద్ధిచేసు కొని గంగలో స్నానమాచరించునపుడు (గంగాభవానీ లోకపా వనీ) యని గంగా దేవిని ప్రార్థించుతూ మీ మీ యిష్టదేవ తా ప్రార్థనలతో స్నాన మాచరించి, మీడిగుడ్డల తోకాని, తడిగుడ్డలతోకాని, నాగల ప్రదక్షిణ చేయునప్పుడున్నూ, చిన్నకొండ, పెద్దకొండపై ప్రదక్షిణ ముచేయు నప్పుడున్నూ, నిర్మల చిత్తులయి ఏకభావన గలిగి భయమును ప్రేరేపింప జేసుకొని మీదృష్టిని మీకుడికాలి బొటన వ్రేలియందు వుంచి, మీమెడను కుడివైపుగా వాల్చి కుడిపాదము ముందు

కు పెట్టినపుడు రా అనిన్నీ మరి ఎడమపాదము ముందుకు పెట్టి నపుడు మ అనిన్నీ, మీామనస్సు నందు ఒక పాదమునకు రా ఒకపాదమునకు మ అని భావన యందు నుత్సరించు కుంటూ నిబ్బరముగాను, నిదానముతోను తొందరపడక ప్రిక్కచూపులు చూడక మవునము దాల్చి యెవరితోగూడా పలుకకుండా ప్రదక్షిణములు చేయుచూరావలయును. మరి శ్రీవార్లను దర్శించు నపుడు, స్వామి దివ్యమంగళ కర విగ్రహము ను రెప్పవాల్పక 1 నిమిషము కిరీట శిఖమునుండి అంగుష్ట ములవరకు నిదానించిచూచి, తోడనే కన్నులుమూాసుకొని, ఆదివ్యమంగళ కరవిగ్రహము, మీా భూమధ్యలో దృష్టియందు స్వామి అగపడులాగున భావనవుంచిన అదేమాదిరి స్వామి మీా దృష్టిలో ప్రసన్నమైనవెనుక ఆయానందము మీాకే తెలియును, ఆప్రకారం సేవించుకొని, తీర్తము పుచ్చుకొనునపుడు (రామ భక్త వీరాంజనేయస్వామి పాదోదకం సర్వరోగనివారణం సర్వ పాపహారణం పావనం శుభం) యని యీా మంత్రము నుత్సరించుతూ భక్తితోతీర్థ ప్రసాదములు స్వీకరించి శ్రీమాన్ భట్టాచారి స్వాములకు దండము సమర్పించి అనుజ్ఞబడసి కొండ తిగునప్పుడు పరుగులతో రాకుండా నిదానించివస్తూ ముందు మాాదిరీగానే ప్రతిఅడుగునకు రామ నామశబ్దముతో కొండదిగి మీాభోజనం అయినవెనుక భవత్కథలుగల గ్రంథములు ఏవైన చదువడముకాని లేక వినడముకాని బియ్యము వకపిడికెడు కాని ఒకదోసెడుకాని ఒక పళ్లెరముతోనైన ఒక ఆకులోనైనా వేసుకొని గింజగింజకు (రామ) అనుశబ్దముతో మరిసాయంత్రం మీారుసేవకు వెళ్ళువరకు ఆ ప్రకారం బియ్యపు గింజలను.

రామనామముతో యేర్పించి వేరేఒకచోట వుంచవలెను. సా యంత్రం అదేప్రకారం సేవచేసి వచ్చినపిమ్మట వుడికిన పదార్థములను యేమాత్రం భుజించకుండా తేలికపదార్థములు, అటుకులు తడిపికాని పేలపిండికాని వేరు శెనగపప్పుగాని మితముగా భుజించి కొంచెము పాలుత్రాగి వృధాగానిద్రించకుండా మీరున్న సత్రములలోకాని, భజనమందిరములలోకాని 1 గంట హరి నామస్మరణతో భజనజేయడముకాని వినడముగాని. ఏ సత్కథలయినను చదువడముకాని వినడముకాని జరిగించి పండుకొనునప్పుడు పక్కమీద పవ్వళించి యేవేవో మనస్సునందు తలంపులు తలుచుకోకుండా యింటివద్ద బిడ్డలు యెట్లున్నారో యనిన్నీ వ్యాపారాలు యెట్లున్నవోఅనిన్నీ, పంటపైర్లు యెట్లున్నవోయనిన్నీ బాకీలు వసూలుఅయినవో లేదోఅనిన్నీ యీలాటి విషయములలో మనస్సును బంపక నిద్రబోకముందే భక్తినిలకడగల క్షేత్రములో యిటువంటి సేవచేయుచూ, క్షేత్రనాథుని దర్శించుతూ, భక్తాదులను సేవించుకొనుచూ యీ దివ్యక్షేత్రమునందు, నిద్రించ గలిగినందుకు, మన భాగ్యమే భాగ్యమనిన్నీ, శ్రీవారి కృపాకటాక్షముచే ఇక్కడికి రాగలిగితిమనిన్నీ, ఆనందముజెంది శ్రీవారిని మీామనస్సునందు ధ్యానించుతూ నాశికమునుండి పీల్చుకొను శ్వాసముతో ॥రా॥ అను అక్షరమును, తోడుచేశి. శ్వాసలోనే తీసుకొనునప్పుడు, రా॥ అనిన్నీ విడుచునప్పుడు, మ యనిన్నీ, అక్షరపానముచేయుచూ మనస్సును మరేవిషయాదులలో పోనివ్వక యీఅక్షరపానముతో ఆనందనిద్రజెందవలయును. మరియు పెద్దకొండ

యెక్కునప్పుడుకాని పెద్దకొండపైన ప్రదక్షణములు చేయున
ప్పుడుకాని ఒక అడుగునకు, నరహరిరూపాయనిన్నీ రెండవ
అడుగునకు నవనారసింహా యనిన్నీ, కుడికాలి బొటనవ్రేలి
యందే దృష్టియుంచి సేవచేయవలయును. తల్లి తండ్రులారా!
యీవిధముగా ధృఢనమ్మకముపెట్టి మీరు సేవచేస్తూ వచ్చిన
మీమనస్సు ఏవిధముగా ఒకేనిలకడగా నిలువ బొయ్యేదిన్నీ,
ఆయానందము ఎట్లువుండేదిన్ని, దైవ సందర్శనములు మీ
కేలాగున కలుగబొయ్యేదిన్ని, మీకే తెలియగలదు. నేను బొగ
డవలసిన పనిలేదు. యీ క్షేత్రనాథుడు, భక్తినిజూచి భక్తి
కొలది ఫలమిచ్చువాడుగాని భోగభక్తినిజూపక త్యాగ భక్తు
లై వారి వారి భక్తి త్యాగముకొలది, దాన ధర్మముల
సత్కైంకర్యములు జరిగించుతూ రావలయును. త్యాగము
జూపకుండా దమ్మిడీ అయినను వినియోగముచేయక, ఫలము
ఎక్కువ కావలయుననికోరి సేవచేసిన, ఫలము సిద్ధించినను,
ప్రయోజనం వుండదు. తిరుపతి క్షేత్రనాథుడు, ద్రవ్యము
జూచి ఫలమొసగువాడగు, వడ్డికాసుల వాడగుటచే, భక్తాదు
లతో, క్రిమినల్ ఆక్టు చట్టప్రకారం శిక్షకొద్ది ద్రవ్యమును
వడ్డితో దేశీలువసూల్ చేస్తూ, బంగారి శిఖరములుగల
గోపురములతోడను, బంగారి పల్లకీ వాహనముల తోడను,
కోట్లకు వెలచేయు పచ్చ పతకములతోడను జగత్ చక్రవర్తి
యై జగదాధీరుండై ద్రవ్యమును విశేషముగా ఆర్జించి అనేక
ధర్మశాలలతోను, అనేక సేవాదళములతోను, అతివైభవాలం
కార భూషణుడై ప్రబలియున్నాడు. యీ క్షేత్రనాథుడు,

భక్తికి బద్ధుడై, భక్తుల మనోయభీష్టములను నెరవేర్చి పంపు తూ, యున్నందున, యీ బీదస్వామికి భక్తాదులు కూడ యేమిన్నీ సమర్పించకుండా, యేకట్టడములు కట్టించకుండా, ఫలములుపొంది పోవడమేకాని, దేవస్థానగాలి, గోపురముల పై శిఖరములున్నవా లేవా, యనిన్నీ, దేవస్థానములలో, అపాయ కరమైన మంటపములు యేవిధముగా వున్నవి, అనిన్నీ గమనించి చూచి వాటిని మరామత్తులుకూడా చేయించుటకు కష్టముగా యున్నది. ఇక్కడికి వేంచేసి శ్రీవారి సేవచేశి అనుజ్ఞబడసి, ఆనందముతో సుఖంచుచున్న లక్షాది ప్రభువులగు భక్తాదు లెందరో యీ స్వామిసేవర్థులయి, యీ మధ్యరాష్ట్రమునం దున్నారుకాని అట్టివారున్నారనుటకు, యీ క్షేత్రమునందు, అట్టివారి నిదర్శనములు యేమిన్నీ అగుపడలేదు. గాన తంద్రు లారా! ముఖ్యముగా, మహాద్వారముయొక్క గాలి గోపుర ములు అచ్చటచ్చట ప్రతిమలు భిన్నమైయున్నవి. వాటిని మరామత్తుచేయించడం గోపురకళశములు బొత్తిగా పెద్దకొండ పైన అస్సలేవు. అచ్చట కళిశములు స్థాపించడము యీ కైం కర్యములు జరిపించడమున్నూ, ఆంజనేయులవారి సన్నిధియందు చక్రతీర్థము ప్రక్కనవుండే రాతి మండపములో భక్తాదులు కూర్చొనులాగున పరుపుబండలువేయించి మండప మరామత్తు చేయడమున్నూ ముఖ్యముగా జరిగించిన, మహాఫలము లభిం చును. తల్లి తంద్రులారా! మీ దృఢనమ్మకమయిన త్యాగ భక్తి ఎంత తూకముండునో, మీ ఫలములు అంతకంటె ఎక్కువై యుండును. త్యాగ భక్తిచూపక దమ్మిడీవదలక, మగ

టాలు కట్టుకొని, లేనిపోని నీతులుమాత్రం చెప్పుకుంటూ ఇప్పు
డే పరమపదం వెళ్లువారివలె, మమ్మొవరు తాకరాదనిన్నీ,
యితరుల చేతినుంచి ప్రసాదమిచ్చినను పుచ్చుకొనమనిన్నీ,
మా ఆచారం గొప్పదనిన్నీ, ఆచారాలుమాత్రం, అద్భుతము
గా పెట్టుకొని, అనాచార సంబంధములయి, ప్రాలుబ్ధ కర్మ
లకులోనై, రోగబాధలచేత యీ క్షేత్రమునకువచ్చి, మీ
ఆచార ప్రభావము, ఆంజనేయులవారి యెదుటజూపి, ఆజ్ఞ బడిసి
సుఖించుటకు మీగ్రామాలకు వెళ్లకుండా యిందేల నున్నారు?
భాగవతోత్తములారా, మీ ఆచారపద్ధతులు మీరు క్రమ
ముగా జూచుకుంటూ, అథితులను, ఆదరించకుండా, భూత
దయాళులై ప్రవర్తించక పోయిన ఆచారములన్నియు, అనా
చారములుగానుండును. గాన మీ శక్తి వంచనచేయక, యీ
క్షేత్రమునందు దాన ధర్మములతోను, భజనానంద గీతముల
తోను సదాచార సంపన్నులయి, దయాలులై, గుడి, భట్రా
చారి మొదలగు పరిచారకుల సత్కరించుచూ, సర్వకాల
సర్వావస్థలయందు శ్రీరామనామము జపించుతూ యీ క్షేత్ర
మునందు వసించి సేవజేస్తూ వచ్చినవారలకు, సర్వపీడలుతొల
గి, సర్వసంపదలతో, యీలోకమునందున్నూ, పరలోకమందు
న్నూ, బ్రంహ్మానంద పదవులలో శాశ్వితసుఖము అనుభవించె
దరనిన్నీ, యిందులో తప్పిదములను మన్నించి, పుత్ర వాత్స
ల్యము జూపెదరనిన్నీ ప్రార్థన.

ఇట్లు భక్తుల పాదధూళి,

పం. ఎ. నారాయణదాసు.

## ఘటికాద్రి గంగతీర్థముల నామములు.

1 చక్రతీర్థము
2 పాండవతీర్థము
3 సంజీవితీర్థము
4 నరసింహాతీర్థము
5 బ్రహ్మాతీర్థము
6 లక్ష్మీతీర్థము
7 భైరవితీర్థము
8 గౌతమితీర్థము
9 రుణరణతీర్థము
10 శేషతీర్థము
11 గరుడతీర్థము
12 నిమిషాలతీర్థము
13 సూర్యచంద్ర తీర్థము
14 రామలక్ష్మణ భరతశత్రుఘ్న తీర్థము
15 గజేంద్రతీర్థము
16 వజ్రతీర్థము
17 భేతాళతీర్థము
18 అమృతఫల తీర్థము
19 వాల్మీకితీర్థము
20 శంఖుతీర్థము
21 పంచపాండవుల తీర్థము
22 ఏకాదశి తీర్థము
23 ద్వాదశి తీర్థము
24 తులసితీర్థము
25 వ్యాఘ్రతీర్థము
26 తిరుక్కావేరి తీర్థము
27 కన్నికెలతీర్థము
28 పుండరీక తీర్థము
29 నందితీర్థము
30 పాదతీర్థము
31 కొడకవ్వతీర్థము
32 హంసతీర్థము
33 విమానతీర్థము
34 పాపనాశన తీర్థము

యీ మొదలుగాగల పావన గంగ కొలనులచేత యీ గిరిప్రదక్షణమున యున్నూ, ఆభరణములోను 108 తీర్థములు గలవు. తెలిసి చూచినంత మట్టుకు కొన్ని తీర్థముల నామములను వ్రాయగలిగితిమి.

శ్రీమాన్ తాడిపత్రి పండరీభక్త ఎ. నారాయణదాసుగారికి నందిపాటి, శేషమాంబగారు సమర్పించిన పంచరత్నములు.

సీ॥ శ్రీమించువాగ్దేవి జిహ్వాయందు వసించి
పలికించెనో ఇట్టి పాటలెల్ల ।
యంబుజాక్షుడు హృదయాంబు జంబుననుండి
కలిగించెనో భక్తి క్రమమదెల్ల ॥
నారద మౌనియెన్నగ కర్ణములయందు
బోధించెనో ధాటి పుంజమెల్ల
సనకస నందనుల్ సరివితోనొంటిగా
వినుపించిరో యోగ విద్యలెల్ల ।

గీ॥ లేకపోయిన నిబ్భంగి లోకమందు
ఖ్యాతియును సద్గుణంబులు గల్గుటెట్లు ।
విష్ణుపూజా పరుండవై వెలయుటెట్లు
సరస నారాయణాహ్వయసాధు హృదయ॥

సీ॥ కడపపురంబులో ఘనులెల్ల కొనియాడ
రంగప్రతిష్ట వారక నొనర్చి ।
భక్తజనాళికి బహుసంత సంబుగా
పండరీభజనలేర్పాటుజేసి ।
సంగీతసాహిత్య సత్కళాన్వితమైన
పాటలనాటల ప్రబలపరచి ।
మూఢులకెల్లను ముక్తిమార్గంబని
హరినామ సంస్తుతి నమరదెల్పి॥

గీ॥ యశముగాంచితి వారొర విశదముగను
పామరులకెల్ల ముదమాయభాపములను ।
భక్తులకు సంతసంబని పలుకవలెనె
సరసనారాయణాహ్వయ సాధుహృదయ ।

సీ॥ రంగనిరూప మారయవేడ్క లభియింప
రంగనినామమే రహిందలప ।
రంగనిమంత్రమే రమణతో పఠియింప
రంగనిపూజ వారకనొనర్ప ।
రంగనిభజనమే రాత్రిళులనుజేయ
రంగనిభక్తి మీరంగగొలువ ।
రంగనిసత్కథల్ శృంగారముగదెల్ప
రంగనికర్ణ రంధ్రముల వినగ ॥

గీ॥ నేర్చితివితండ్రి యింతకునేర్పికేది
మానుగానసంతసిల్లితి మానసమున ॥
భక్తవత్సలునకు నిజభక్తుడవని
సరసనారాయణాహ్వయ సదయహృదయ ॥

సీ॥ అర్థంబు శ్రీహరి కర్పణంబుగజేయ
మాన్యులతో మంచిమాటలాడ ।
భామామణుల మాతృ భావంబుగా నెన్న
యొరుల దూషణకు నోర్చియుండ ।
దేశదేశంబుల ధీరతదిరుగగా
యజ్ఞానులకు జ్ఞానమమర దెల్ప
నిరశన వ్రతములు నిష్టతోగావింప

శిష్యుల సుతులట్ల జేరదియ్య ।

గీ॥ నీకెతగునయ్య యోయయ్య నిక్కముగను
దివ్యమగు తాడిపత్రిలో దీపమట్ల ।
వెలుగుచున్నాడ వెంతయు వేడ్కతోడ
సరస నారాయణాహ్వాయ సదయ హృదయ ॥

సీ॥ భవరోగములబాప పరమౌషధంబును
దుఃఖదారిద్రింబు తొలగ ధనము ।
మించిలో శత్రుల ద్రుంచ కృపాణంబు
పామరతిమిరముల్ బాపహారియు ।
సర్వేశ్వరుని జేర సరియైన మార్గంబు
పెతరుల స్వామికి భీతికరము ।
పాసగ జీహ్వకు రుచిపుట్టింప నమృతంబు
మనసును బంధింప మంచితాడు॥

గీ॥ డెందమునకన్ననో మహానందకరము
నైనహరిపాద భక్తినీ కమరియుండ
గానెధన్యుండవైతి కలియుగమున
సరస నారాయణా హ్వాయసదయ హృదయ ॥

నందిపాడు, కర్నూలుజల్లా. | ఇట్లు, కవిరత్న శేషమాంబ.

# కలియుగ ధర్మకోటి యంత్రమహాభుషి స్వామికి జే.

సద్గురు మహారాజకీ జై. పాండురంగ వరదగోవింద్గా,

పుండరీక స్వామికి జై. గోవింద.
జ్ఞానదేవుతుకారామస్వామికి లక్ష్మీనారసింహా గోవిందా
సక్కుభాయి ముక్తాభాయికి జై. గోవింద.
చోకమేళ చాంగదేవస్వామికి వీరాంజనేయ వరదగోవిందా.
భాగవతా పాదదూళికి జై. లక్ష్మీ వెంకటరమణ గోవిందా.

# మనో పుండరీక వరద హరి విఠల్
# శ్రీ జ్ఞాన దేవ్, తుకారాం.

శ్రీమాన్ పండరీభక్త ఎ. నారాయణదాసుగారు రచియించిన యీ గ్రంథముయొక్క శాశ్వితహక్కును, గ్రంథకర్తగారివల్ల, నేను అధికారం పొంది ముద్రించినాను. నా అనుమతిలేనిదే యెవరైన యీ గ్రంథమునందుండు కీర్తనలుకాని మరేవికాని, ముద్రించినను మార్చినను అంకితములు మార్చి పాడినను నా నష్టమునకు జవాబుదార్లుగా యుంటుయున్నారు. యీ గ్రంథములు మా ఏజంట్లుగా గ్రంథకర్తగారు ఏర్పాటు చేస్నివారి యీ క్రిందవిలాసములలో కూడా యీ గ్రంథములున్నూ పాండురంగస్వామి బృందావన సంకీర్తనలుగల గ్రంథములున్నూ, పాండురంగస్వామి పోటోలున్నూ గ్రంథకర్తగారి పోటోలున్నూ, ఘటికాద్రియోగ నృసింహస్వాములు యోగాంజనేయులవారి పోటోలున్నూ కలియుగ కడద్వార కాపురమను కడపరంగని పోటోతో కలికల్మష నాశనమహాముక్తి మంత్రముగలపటములున్నూ అస్సలుతుళసీ జపమాలలున్నూ పండరీ



భక్తుల పాదధూళి,

రాజయోగి,

పండరీ భక్త ఎ. నారాయణదాసు.

నుండి తెప్పించిన కస్తూరితిలకమును బుక్కాయున్నూ పండరీ క్షేత్ర పాండురంగని ఫోటోలున్నూ మావద్దదొరకును.

కె. సీతారామయ్య

విఠల్ విలాస్ బుక్ డిపో, కడప.

ఏజంట్లు.
నల్లమల్లి సుబ్రమణ్యం శెట్టి
చిన్న బజార్ నెల్లూరు.

ఏజంట్లు.
యక్కలూరు ఆదెయ్య శెట్టి
బుక్ సెల్లర్ తాడిపత్రి.

ఓం.

శ్రీరుక్మిణీ పాండురంగప్రసన్నం.

# ఘటికాద్రి హఠయోగానంద భజన సంకీర్తనలు.

గణపతి రాజా, గణపతిరాజా, విఘ్న వినాయక గణపతి రాజా, ‖గణ‖ ఏకదంతినా, గణపతిరాజా ఏకనిరంజన గణపతిరాజా, ‖గ‖ మూషకవాహన గణపతిరాజా మోదుక హస్త గణపతిరాజా, ‖గ‖ నారాయణ పోషా గణపతిరాజా నాట్య వినోదా గణపతి రాజా, ‖గణ‖ జై బోలో గణపతి మహా రాజ కీ జై.

(2) గురుమహారాజ్ గురూ జై, జై, పరబ్రంహ్మ సద్గూరు, పరబ్రంహ్మ సద్గూరు జై, జై, భట్టరదేవ సద్గూరు, ‖గు‖ సుందరశాస్త్రి సద్గూరుజై, జై, వందేవందే సద్గూరు, ‖గు‖

జే బోలో సద్గురు మహారాజ కీ జే.

జై బోలో సరస్వతి మాతా కీ జై.
జై బోలో జగన్నాథ స్వామి కీ జై.

(3) పారిరారా క్రిష్ణ అను వర్ణమెట్టు.

హనుమ రారా అంజని పుత్రిరారా హిమగిరి విడిచి మహిమలు జూపా వేగారారా ॥హ॥ తారకమంత్రము తలపున నుంచీ దలచీ నానురా ॥ తడయక నావ్యతలు మాన్పావేగా రారా ॥హ॥ కలియుగ ధర్మము కొరకై నిన్నే గాచి నానురా॥ ఇలలో ఘటికాచలములో నిన్నే జూడగంటిరా ॥హ॥ సేవజే యు భక్తులకెల్ల శ్రిమలు దీర్చరా॥ సాహసంబుతో సాధుల రక్షించరారా ॥హ॥ అక్షయమొసగి ఆనందముతో ఆదరించరా కక్షసేయక తక్షణమే రక్షించీ బంపరా ॥హ॥ తాళనాదా మృదంగములతో తాండవమాడెదరా తడవుసేయక కడపపురము నకువేగమే బంపరా॥హ॥యిలలో నారాయణదాసుని యిడుము లుదీర్చరా చలమూసేయక ఫలమొసంగుతూ పాలన సేయురా॥

(4) నామావళి.

హనుమంతా హనుమంతా ధీమంతా ఓబలవంతా మారుతిరాయా హనుమంతా మహనీయమూర్తి హనుమంతా వాయునందనా హనుమంతా వేదవిచిత్రా హనుమంతా సర్వ రక్షకా హనుమంతా సంజీవరాయా హనుమంతా జై బోలో వీరాంజనేయ ప్రిభూకి జై ॥

(5) గోపాలభక్తు వెంటబోవుదాము రారాకృష్ణా॥
అనువర్ణమెట్టు.

శ్రీలక్ష్మీ నారసింహా॥ శీఘ్రగమొనను బ్రోవరారా॥ శీఘ్ర

మె నను బ్రోవరారా॥ ఉగ్రనారసింహరారా॥ ॥శ్రీ॥ బతిమాలు కొంటినయ్యా॥ గతినాకు నీవేనయ్యా॥ పతితా పావానన్ను, సతతముగా బ్రోవుమయ్యా॥ ॥శ్రీ॥ నీమీాద కీర్తనల్, నిత్యా నందముతోడ, నిత్యగానము జేయనెంచి, నిన్నె నేవేడితినయ్యా ॥శ్రీ॥ మంధుడను నేనేయనీ, నిందపాలు సేయబోకు॥ యింది రారమణ నాయందునిర్దయ జూడబోకు ॥శ్రీ॥ నీలామేఘశ్యామ నీవేతప్పడినినాకు॥ నీకీర్తిచాటకుండ నన్నేఅగుడు జేయబోకు ॥శ్రీ॥ దిక్కులేదని నాల్గుదిశలు, తిరిగి దిమ్మరిదీననైతి॥ పద్మ లోచన భక్తిచేత, నిన్నే నేవేడుకుంటి ॥శ్రీ॥ నరసింహనే నిన్ను, నమ్మినందుకు చాలా, నెనరుంచి బ్రోవరాదా, హేధీరా నాతోవాదా ॥శ్రీ॥శ్రీకడప, పురానాథా, రాథా, రుక్మిణినాథా, నారాయణదాసుని, బ్రోవభారమా వోరంగనాథా ॥శ్రీ॥

## (6) నామావళి.

అహోబిళధీరా, నరసింహా, ఉగ్రదేవుడా, నరసింహా పెంచెలిసింహా, నరసింహా, పండరిభూపా, నరసింహా చోళంగి సింహా, నరసింహా, జ్వాలసింహా॥ నరసింహా ఘటికాద్రిసింహా, నరసింహా॥ యాదాద్రిసింహా నరసింహా॥

## (7) భక్తూల పాలిదేవుడా॥ అను వర్నమెట్టు.

రండిరండీ భక్తూలారా॥ శ్రీనారసింహుని జూడరండీ సాధూలారా ॥రండి॥ మండలమున ఘటికాచలములో నిండి యుండిన ప్రభువునుజూడా ॥రండి॥ యోగాంజనేయుల సేవకూ

ఓసాధులారా, యోగనారసింహుని సేవకు, జాగుసేయక ధ్వజ ములుబట్టి, జయజయరామా రామాయనుచూ ॥రం॥ శంకు చక్రధరుడై ధీరుడు, సంజీవరాయుడు, చోళంగి పురములో నిండియుండూ॥ శీఘ్రమె భక్తులబ్రోవా, యోగాసనములో వేం చేసినాడట ॥రండి॥ చెప్పనలవిగాని క్షేత్రము ఓ భక్తులారా॥ ముప్పాలుదీర్చే దివ్య క్షేత్రము తప్పక భక్తుల భ్రమలూ దీర్చే, చోళంగి క్షేత్రమునకూ ॥రండి॥ పావనమైన పాండవ తీర్థమునా ఓ భక్తులారా దివ్యమైన బ్రంహ్మతీర్థమునా బ్రం హ్మనందాముతోడా, స్నానమాడి సేవజేయ ॥రండి॥ పుడమి కడపపుర నివాసుడు పండారినాధుడు, భక్తులబ్రోచే ప్రసన్న దేవుడు గడియలో నారాయణదాసుని బ్రోచిన ఘటికాద్రి సింహునిజూడా ॥రండి॥

### గురు శిష్యుల సంవాదము.

#### మేరే మవులా బులా అను వర్ణమెట్టు

గురువు॥ భక్తా పాండవ తీర్థాక్షేత్రమునకే బోవుదమా ॥భక్తా॥ బ్రింహానందమైన భజనా బృందములో గలిసి మనము పాడుకుంటూ ఆడుకుంటూ వేడుకాతో వేడుకుంటూ ॥భ॥

శిష్యుడు॥ స్వామీ పాండవతీర్థా క్షేత్రమునకే బోవ నేలా ॥స్వా॥ బ్రింహ్మ నందామయిన భజనా బృందమూలో జేరనేలా భజనపాటలు పాడనేలా వేడుకాతో ఆడనేలా ॥స్వా॥ దాచగదెలుపావే దయాబూనవే ॥స్వా॥

గురువు॥ పావనమైన తీర్థమూ భక్తాల నిలయమే క్షే
త్రిము భజన బృందమే మోక్షమూ ॥శ్రీ చోళసింహ్మ క్షే
త్రిమూ ॥భక్తా॥ పాం॥

శిష్యుడు॥ దిట్టముగ ఘటికాద్రి కేయిల పట్టుతోనే
జోవనేలా॥ గుట్టుదెలియగ దెలుపవే గురునాథ నాకెరిగింపవే
॥స్వామి॥ ॥దా॥

గురువు॥ నూటయెనిమిది క్షేత్రిములకెల్ల మేటియైనా
క్షేత్రిమూ నారసింహుని నిలయమూ వీరాంజనేయుల క్షేత్రి
మూ ॥భక్తా॥ పాం॥

శిష్యుడు॥ నారాసింహ వీరాంజనేయ ప్రిభావమేమొ
దెలుపవే నారసింహుడు అందునుండా కారణమేమొ దెలుప
వే ॥స్వామి॥దా॥

గురువు॥ ఋషుల యాగముగాచి దుష్టా రాక్షసుల
మదమణచి భక్తుల రక్షణార్థముజేయ యోగాసనములో వెం
చేసినారు ॥భక్తా॥ పాం॥

శిష్యుడు॥ ఉగ్రిమూర్తి నిబ్బరముతో యోగములో
వేంచేయనేలా రుద్రివీరా ఆంజనేయుడు, జపములోనే నుండ
నేలా ॥స్వా ॥దా॥

గురువు॥ కలియుగంబున కొల్లగా యిలధర్మములనే
నడుపదలచి గాలి గ్రహ రోగముల గొట్టా గిరులపై వేంచేసి
నారు ॥భక్తా॥ ఘటికాద్రి దేవుల జూడని జన్మమేలా ॥భక్తా॥

శిష్యుడు॥ కడప నారాయణదాసుడు ఘటికాద్రిలో మరిజేరనేలా మేటివీరా ఆంజనేయుల పుడమిపై యిటుపోగడ నేలా ॥స్వా ॥దా॥

గురువు॥ ఆంజనేయుల ఆజ్ఞచే ఆక్షేత్రమందున నిలచి నాడు ఆదరించా ఆంజనేయుల ఆ రీతిగోనే పాడినాడు ॥భ॥ పాం॥

(8) గోపాలనందబాల-అనువర్ను మెట్టు.

ధన్యులారా దాసులారా తండ్రులారా తల్లూలారా రండీ ఘటికాచలముజేరుదమూ ఓభక్తూలారా చోళంగి క్షేత్ర మె జేరుదమూ ॥ధా॥ కామక్రోధములాగొట్టీ కాపాయీబట్టీ గట్టిగాదట్టీలనేజుట్టీ ఓభక్తూలారా దిట్టముగ స్వరూపామెబెట్టీ ఆనందముతోడ మనమూ ఆనారసింహునిజూచి ఆంజనేయస్వా మిని వేడగను ॥ధ॥ యిలకలియుగమున చోళంగి గిరిలో తళ తళమను యాదేవునివేడ కొల్లాలుగనే కోరివేడెదమూ ఓభక్తూ లారా మల్లెమొల్లల పూజలుజేయుదము కలియూగా వైకుంఠం బను ఘటికాద్రిక్షేత్రముజేరీ ఘల్లు ఘల్లున భజనలుజేయుద మూ ॥ధ॥ శ్రీ కడపారంగనికొలచీ నారాయణదాసుని బిలచీ శ్రీగమెగిరినీ జుట్టూబోవుదమూ ఓభక్తూలారా శ్రీ లక్ష్మీ దేవినివేడుదమూ గోపూరప్రాకారములూ కోరికతోనె జుట్టీ మనము కోరిభజనజేయ బోవుదమూ ॥ధ॥

(9) (భక్తులారా) అనువర్ను మెట్టు.

సేవింతమూ మనము సేవింతమూ మనము శ్రీ నార సింహునిజూడ బోవూదమూ సాధులారా మీరురండీ మన

చోళంగిపురమునకే బోవుదమూ ॥సే॥ ఘటికాద్రి క్షేత్రమునకే బోవూదమూ మనము హఠయోగిదేవుని జూడబోవుదమూ ॥సే॥ కలియుగ ధర్మముకొరకు గాలిదయ్యములాకొరకు కరుణ తోడ ఘటికాద్రిలో వెలసినాడే ధీరుడు చోళంగిక్షేత్రములో వెలసినాడే ఆయోగాంజనేయునీ ఆడూతుపాడుతూ అంజని దేవి పుత్రాయనీ వేడూదమూ ॥సే॥ ఉగ్రభీకర రూపుడుహారీ ఉక్కూస్తంభమునబుట్టీ హూంకారనాదముచేసి వెలసినాడే భక్తులకొరకు యోగములోనే వెలసినాడే ఆ శ్రీనారసింహుని నారాసింహాయనీ నయభక్తి భయములతో పాడూదమూ ॥సే॥ కోటియంత్రమహాఋషీ కొరకై యా కడపపురిలో పండరీ నాథుడనీ ప్రబలినాడే కల్యాయిపురాములో వెలసినాడే యీ నారాయణదాసుని మొరవిని మనమువేగ ఘటికాద్రిసేవ జేయ బోవూదమూ ॥సే॥.

(10) నామావళి.

ఘటికాద్రి క్షేత్రమునకే పోవూదమూ
చోళంగి క్షేత్రమునకే పోవూదమూ
శ్రీనారసింహునిజూడ పోవూదమూ
యోగాంజనేయులజూడ పోవూదమూ
పాండవతీర్థ స్నానమాడ పోవూదమూ
బ్రంహ్మానందదాసులజెంది పోవూదమూ

(11) గోపాలభక్తులవెంట పోవుదామురారా క్రిష్ణా
అనువర్ణ మెట్టు.

ఘనపుణ్యులారరండీ ఘటికాద్రికేబోవుదమూ ఘటికా

ద్రి జేరుదమూ హారముబట్టివేడుదమూ ॥ఘు॥ పాపమెల్ల బార
దోలు బ్రంహ్మగుంటగంగయుండూ భక్తులకర్మము బారదో
లు పాండవా తీర్థముండూ ॥ఘు॥ రెప్పపాటులోన భక్తిపదవి
నిచ్చె తీర్థములుండూ రుణరణ వజ్ర తీర్థములుండు నరసింహా
తీర్థముండు ॥ఘు॥ కోట్లకొలదిసేవజేయ కోరిభక్తబృందములుం
డు గండివీరధీరుడుండు ఘటికాద్రిధీరుడుండు ॥ఘు॥ వాలమె
త్తి ఆడుచుండే, వానరదేవబృందముండు, లీలలన్ని నేనేయనీ
నిద్రయందు దెలుపుచుండూ ॥ఘు॥ ఘటికాద్రి క్షేత్రమందు
కడపనారాయణదాసుడుండు నరహరిసింహుడుండు శ్రీలక్ష్మి
దేవియుండూ ॥ఘు॥.

(12) రంగూజండాల భజన అనువర్ణమెట్టు.

ఘనమయిన గిరినీజూడా ఘటికాద్రి క్షేత్రముజూడా
ఘల్లు ఘల్లున బోవుచున్నదే గంభీరభజన ఘటికాద్రికే బోవు
చున్నదే ॥ఘు॥ దిట్టముతో దట్టీలుగట్టి పట్టుతో భ్రమలన్నీ
గొట్టీ చుట్టుతిరుగుతు బోవుచున్నదే భక్తూలభజన ఘటికాద్రి
కే బోవుచున్నదే ॥ఘు॥ శ్రీనారసింహాయనుచూ హేవీరా
హానుమాయనుచూ వేగముతోనే బోవుచున్నదే యోగములో
నుండా ఘటికాద్రికే బోవుచున్నదే ॥ఘు॥ గ్రహరోగా బాధల
రోసీ శీగ్రమే నారసింహునిజూడా ఉగ్రముజూపీ బోవుచున్నదే
గ్రహాపీడలగొట్టా ఘటికాద్రి)కే బోవుచున్నదే ॥ఘు॥ ఢక్కీడమ
కా నాదముతోడా ఢమ ఢమ నగార శబ్దముతోడా ఢంకా
వేసి పోవుచున్నదే భక్తూలభజన ఘటికాద్రికే బోవుచున్నదే
॥ఘు॥ శ్రీకడపాపురమూనుండీ నారాయణదాసుని బిలచీ

తాండవమాడుతు బోవుచున్నదే సాధూల భజన చోళంగికే బోవుచున్నదే ॥ఘు॥

(13) ధ్వజమెల్లి పోతున్నదో అనువర్న మెట్టు.

భజన గోష్టిబోవుచున్నదే ధ్వజములనుబట్టి భక్తుల గూడి బోవుచున్నదే ॥భ॥ పడవనెక్కి బోతుంది ఘటికాద్రి పురముజేర ॥భ॥ యోగనారసింహునిజూడా వేగామెయోగ ఆంజనేయస్వామినిజూడా ఆనందమాడుకుంటూ యాహారిని వేడుకుంటూ ॥భ॥ సంసారబంధమువిడచీ సాధూలబిలచీ సింహాపురముజేరాదలచీ సాధుభజనవిహారయనీ దీనబంధో పాహీయనీ ॥భ॥ తనువు ఖాయమునుండబోదనీ ధారాపుత్రులు తనువువెళ్లితే తగిలిరారనీ తారకమంత్రార్థమను భావమును జూడ ॥భ॥ రెండుకొండలనడుమనుండినా పాండవ తీర్థమునందు వేగజలకమాడినా పాపరాసులెల్ల తరిగి పరమునకుజేరవేగ ॥భ॥ కడపనారాయణదాసునీ ఘటికాద్రియందు కుదురుగానే నిలుపుకోనీ నటనజూపీ భక్తులకెల్ల కఠినబాధ ఖర్మలు బాప ॥భ॥.

(14) ఏడానున్నాడో రంగడు అనువర్న మెట్టు.

యేడానున్నాదో ఘటికాద్రియనే దివ్య క్షేత్రం ॥ఏ॥ ఏడ జూచినజాడలేదు నడువఒడలుబలములేదు ॥ఏ॥ ఎత్తయిన గిరులుగలా ఎత్తుగోపురముగలా సత్యమైన దేవుడుండే శ్రీ చోళసింహాపురము ॥ఏ॥ సప్తఋషుల క్షేత్రమటా శ్రీలక్ష్మి నిలయమటా సాధుజనాపోషకుడుండే సంజీవిరాయుని క్షేత్రం

॥ప॥ తడువులేక నారాయణదాసుని గడియలో గాచినట్టి పురము పుడమి భక్తులకెల్ల భక్తి ముక్తి నొసగు క్షేత్రం ॥ప॥.

(15) అదిగో చూడండీ పండరీ అనువర్ణమెట్టు.

అదేజూడండీ ఘటికాద్రి ఓసాధులారా ॥అ॥ గిరులు గోపుర కళశములా ఘంటానాద శబ్ధముగలా ప్రాకారమంట పముల ప్రబలియుండిన దివ్యక్షేత్రం ॥అ॥ లక్ష్మీనారసింహాయని పలుమారు వేడేవారు వేడుతూ వీరహనుమాయనీ వేమారుబలికేవారు ॥అ॥ సోపానములమీద గొప్ప పర్వతము నందు బారులుగట్టి భక్తుల బ్రోచు భీకరస్వామి . సన్నిధియుంటూ యోగాసనమున నిగనిగమరటూ ఉగ్రసింహుడేయుండూ భక్తులకెల్లను కలిమినిచ్చుటకు లక్ష్మీదేవియేయుండూ అదిగో చిన్నకొండమీదనుండే చిన్నమూర్తి కళలతోడా కన్నతండ్రియైన మహామిన్నయైన వీరుడుండూ నాలుగుభుజముల యోగములోనే వానరదేవుడు వెలయూ వందేయనివేడిన వారికి వరములు నొసగుతునుండూ ॥అ॥ రకరకమైన పుష్ప రమ్యమైన తోటలతోనే మర్కట సమూహముతోడా రమ్యమయిన ధీరుని పురము హతముతోనే నారాయణదాసుడు గట్టిగ నిలచిన పురమూదట్టివేసి ప్రత్యక్షమయ్యే భక్తులబ్రోచే వైకుంఠ పురము ॥అదిగో॥.

(16) ఇదియేనాపండరిక్షేత్రం ఓసాధులారా అనువర్ణమెట్టు.

యిదియేనా ఘటికాద్రి ఓసాధులారా ఓసాధులారా, ఓభక్తులారా ॥ఇ॥ ఘంటానాద శబ్దములో ఘనలెక్కిన తొగుల క్షేత్రం ॥యి॥ సప్తఋషుల బ్రోచిన క్షేత్రం సాధుల



చోళంగిపురమునకు సమీపములో ఘటికాద్రి క్షేత్రమున
పెద్ద కొండపై యుండు,

## యోగ నారసింహ స్వామి.

రక్షించేక్షేత్రం సేవజేసే చోళంగిక్షేత్రం శీఘ్రమెబ్రోచే దివ్య క్షేత్రం ||యి|| భక్తితోనే సేవజేసిన ముక్తినొసగు భక్తులక్షేత్రం భక్తిలేక యుక్తిజూపిన భయముజూపే భీకరక్షేత్రం ||యి|| భక్తులకెల్ల దేవుడననీ దుష్టులకెల్ల యముడననీ భయము భక్తి జూపుచుండే భీకరనరసింహుని క్షేత్రం ||యి|| రోగగ్రహపిశాచములను వేగమె దొలగగొట్టేక్షేత్రం బాగుగ సంతానమునొసగి బ్రహ్మానందము జేసేక్షేత్రం ||యి|| కడప నారాయణదాసుని కరుణతోడ బ్రోచినక్షేత్రం కరుణలేని భక్తులకెల్ల ఖర్మబలముజూపే క్షేత్రం ||యి||.

(17) శ్రీరామనామం మరువాం మరువాం అను వర్ణమెట్టు.

నూటాయెనిమిది క్షేత్రాములకెల్ల నేటియైన క్షేత్రమిది యేకదా, యిదియేకదా, యిదియేకదా, ఘటికాద్రి క్షేత్రము ఇదియేకదా, ||నూ|| దారిలేనీ నిజ దాసభక్తులకెల్ల దారిజూపిన దేవుడతడేకదా, యితడేకదా యితడేకదా, నరహరిసింహుడితడేకదా, ||నూ|| జపముజేయుచు యోగతపములో గూర్చొండి, జయమునొసగూ దేవుడితడేకదా యితడేకదా, యితడేగదా యోగాంజనేయుడు యితడేకదా, నూ|| కల్లూలకెల్లాను, కొల్లాగవరమిచ్చె దండీదేవీతల్లి యీమేగదా, యీమేగదా, యీమేగదా, వరలక్ష్మీదేవమ్మ యీమేకదా, ||నూ|| నారాయణదాసుని నాట్యములాడించి నటనజూపిన పురము యిదియే కదా ఇదియేకదా యిదియేగదా యిల బ్రంహ్మక్షేత్రము ఇదియే కదా, ||నూ||

ము విడచి, పోకుమానండీ, నిబ్బరముగ జగడములాడక, శాంతితోనుండండీ, ఇస్పేటు ఆడబోకండీ, ||పు|| ప్రాకారములు జుట్టునపుడు, భక్తితో నడువండీ, భూమి అదరునటుల వేగమె, పరుగిడబోకండీ, భావమున దేవునివేడండీ, ||పు||

యిదేకదా, యిదేకదా, ఘటికాద్రి క్షేత్రం బిదియే కదా, ఘటికాత్రిక్షేత్రం బిదేకదా, మేటియైన క్షేత్రం బది కదా, ||యి|| అతడేకదా, అతడేకదా, అంజనిపుత్రుడు అతడే కదా, అంజనిపుత్రుడు అతడేకదా, వీరాంజనేయుడు అతడే కదా, ||యి|| అతడేకదా, అటడేకదా, నరసింహదేవుడు అతడే కదా, నరసింహదేవుడు, అతడు అతడేకదా, మన నరులకు దేవుడు అతడే కదా, ||యి|| ఆమెకదా ఆమెకదా, మనవర లక్ష్మీదేవి ఆమేకదా, ఓంకార లక్ష్మీదేవి ఆమేకదా, ||యి|| యితడేకదా యితడేకదా దాసదాసుడు యితడేకదా దాసదాసుడు యితడేకదా, నారాయణదాసుడు, యితడేకదా, ||యి||

(22) నామావళి.

| | |
|---|---|
| భక్తులక్షేత్రం బిదేకదా? | ప్రత్యక్షదేవుడు ఇతడేకదా. |
| ముక్తిక్షేత్రం ,, | దీనదయాళుడు ,, |
| వైకుంఠక్షేత్రం ,, | మహాలక్ష్మీదేవి యీామేకదా. |
| ఘటికాచలము యిదేకదా | చోళంగిరాణీ ,, |
| చోళంగిక్షేత్రం బిదేగదా | భక్తులతల్లీ ,, |
| పాండవతీర్థం ,, | త్రిభువనరాణీ ,, |
| బ్రహ్మతీర్థము ఇదేకదా | త్రిలోకసుందరి ,, |
| శేషతీర్థము | త్రిశూల ధారీ |

చక్రతీర్థము    ఇదేగదే ధన లక్ష్మిదేవి యీమెకదా.
రుణరణతీర్థం    ,,    బ్రహ్మానందం యిదేకదా.
నరసింహాతీర్థం    ,,    ఆనందం బ్రహ్మానందం.
నిమిషాలతీర్థం    ,,
నరసింహా ఉగ్రుడు ఇతడేకదా.
లక్ష్మినాథుడు    ,,
భక్తులదేవుడు    ,,
దయ్యాలధీరుడు    ,,
ఆంజనేయుడు    ,,
యోగాంజనేయుడు    ,,
చతుర్భుజదేవుడు    ,,
భుజబలశాలి    ,,
గ్రహాములవీరుడు    ,,

(23) గోవర్ధనగిరీలోన గోపాలాపురములోన బలుగూ
డాడెరా, అను వర్ణమెట్టు.

కిష్కింధపురములో ఆడి ఘటికాద్రి పురముజేరి కొల్ల లాడెరా వీరుడు కొల్లలాడెరా, ||కి|| శ్రీరామచంద్రుని గొలచి, సీతజాడలు దెలుసుకోని ఆనందమాడెరా, ||కి|| లంకారాజ్యము హాతముజేసీ, లంకా రావణ గర్వమణచి, బలుగుడాడెరా, శూరుడు బలుగుడాడెరా, ||కి|| వానర సైన్యముతోనే వేగ వారధిగట్టి వారధిదాటి, రయమునదెచ్చెరా సీతను, రయమున దెచ్చెరా ||కి|| నారాయణదాసుని చేరబిలచి, మర్మములెల్లను

చల్లగ దెలిపి, వ్యతలుమాన్పరా, మారుతి వ్యతలుమా
న్పరా, ||కి||

(21) నామావళి.

| | | |
|---|---|---|
| గోపురంబులూయెచ్చటజూచిన | | సేవ తల్లులు. |
| మండపంబులు | ,, | సేవభక్తులు. |
| ధర్మఛత్రములు | ,, | వానరసైన్యము. |
| భజనశాలలు | ,, | గోవిందశబ్దము. |
| ధ్వజస్తంభములు | ,, | ఎత్తయినగిరులు. |
| గంటానాదము | ,, | మంగళవాద్యములు. |
| గంగగుంటలు | ,, | దానధర్మములు. |
| పుష్పతోటలు | ,, | భజనగోష్టీలు. |
| అరటితోటలు | ,, | వైష్ణవలీలలు. |
| నందనవనములు | ,, | స్వరూపధారులు. |

(24) యిక్ష్వాకు కులతిలకా, అను వర్ణమెట్టు.

నారాసింహా తండ్రీ, నన్నేలు నన్నేలు నారసింహా.
రత్నభూషణసింహా రక్షింపు, రక్షింపు నారసింహా ||నా||
పుండరీకాక్ష నీ అండజేరీనారా నారసింహా |నా|
దండిదాతవునీవని ధరణిలో జాటితీ ||నా||
నేనెంతవేడినా నీకేలదయరాదు || నా||
నిన్నూనగొనియాడాను నే నెంతవాడనూ ||నా||నా||
ప్రహ్లాద నారదులా, భక్తిజేయా లేనే ||నా||
పాపఖర్ముడగానీ పతితోడ నేనుగానూ ||నా||నా||
స్తంభామందునబుట్టి దాన వేంద్రునిజీల్చి ||నారా||

భక్త వత్సలుడవై ప్రబలీన దేవా ॥నా॥
భళి భళీ నీవంటీ, ప్రభువు వేరే లేరే ॥నా॥
బహూదండములుజేతూ, బ్రోవసమయూము గదరా ॥నా॥
భావామందున నీ భజనజేతునుగాన ॥నా॥
భవభాధా బ్రమలన్ని బ్రోవసమయముకారా ॥నా॥
కడప నారాయణదాసునిగావరా ॥నా॥
తగవ్రూసేయుక నా యిడుమూలు దీర్చరా ॥నా॥

(25) మాధవా రాధలోలా, మహిని కడపనుండ, వేలా అను వర్ణమెట్టు.

మారుతీ నీవేగతీ, మమ్ములబ్రోవవే భూపతీ ॥మా॥ మాకన్నతండ్రీవి నీవేయని, అన్నా నిన్నేనమ్మినారా, నిక్కమన్న నీకన్న దిక్కులేదె హనూమన్నా ॥మా॥ బ్రంహాండ రూపరారా పద్దుయేల వేగరారా, బాహుబల శూరరారా, బాలాంజనేయరారా, ॥మా॥ దశారంగశూరరారా, రాక్షస సంహారరారా, వీరహనుమంతరారా. రక్షించభారమునీదేరా, ॥మా॥ నీకుమ్రొక్కెద హనూమంత, నీతిమంతా, గుణవంత, నీపద ధ్యానంబు నేను నెరనమ్మినానుగదరా, పంచముఖ హనుమంతా సంచితఖర్మము ద్రుంచువేగ వంచించబోకనా, వాంచితలన్ని దీర్చువేగ, పుడమి నారాయణదాసుని, తడవుసేయుక బ్రోవకుండిన, కడప పాండురంగని యాన, పుడమి పండరి భక్తులయాన ॥మా॥

(26) గోకూలమందునబుట్టి గోవర్ధనగిరినిమీటి అనువర్ణమెట్టు

మహాలక్ష్మిదేవిరావే మహిలో ఆదిశక్తివిరావే మమ్ము బ్రోవవేగమెరావే వరలక్ష్మిదేవి రావే ॥మ॥ కంచికామాక్షివి నీవే మధురమీనాక్షివి నీవే అధముడను నన్నూ, గావవే అక్షయముతో వేగా, ఆదరించినన్నూగావవే ॥మహా॥ పాండురంగని రుక్మిణివమ్మా, పాండవులాద్రౌపదివి యమ్మా, పాలానాజేయవేయమ్మా, నాభాగ్యదేవి పాలానా జేయవేయమ్మా, ॥మ॥ ఘటికాద్రివమ్మా, యో ఆటలమ్మ శక్తివియమ్మా ఆదరణజేసిగావవే అహోబలదేవి ఆదరించి మమ్ములబ్రోవవే ॥మ॥ ధరకడప దండిదేవి ద్వారకారుక్మిణిదేవి నారాయణదాసుని గావవే ॥మ॥ యెన్నిగడవులాయె నమ్మా యేలచలమేలనమ్మా వేగమెనీదయనూ జూపవే కలువాయి దేవి వేగమేనావ్యతలు మాన్పవే ॥మహా॥

(27) నవనీత చోర దేవకీ

అనుపర్ణ మెట్టు.

అంజనీపుత్ర ఆంజనేయ ఆదరించరా ॥దే॥ ఆదరించరా ఆపతోద్దార నన్నాదరించరా ॥దేవా॥ ఆదరించరా ॥అంజ॥ ఏకబాలవృద్ధదేవా నిన్నేనమ్మితీ ॥దేవా॥ నిన్నేనమ్మితీ జోకతో నీపాదసేవజేసి వేడితీ ॥దేవా॥ నిన్నేనమ్మితీ ॥అం॥ గతులు జూప దేవుడవనీ మతిలోవేడితీ ॥ప్రభూ॥ మతిలోనమ్మితీ సతతము నీసేవయే, సద్గతులుజూచితీ ॥దేవా॥ భక్తితో వేడితీ ॥అం॥ ఖడ్గ గదా ధరా ధీరా కరుణజూపరా నాభాగ్యధేవ జూపరా, కలుషహారణ జాలమేల చేరదీర్చరా నన్నే జేరదీర్చరా ॥అం॥ అవని నారాయణదాసుని, ఆపదమాన్పరా

ఆపదమాన్పరా ఆనందమహిమజూపి కడప జేర్పరా ॥దేవా॥ శలవొసంగరా ॥అ॥

పాండురంగారారా పండరినాథరారా అను వర్ణమెట్టు.

ఆంజనేయరారా సంజీవరాయరారా ఆనందమాడుతూ ఆదరించరారా ॥ఆ॥ ఘల్లుఘల్లున ఘటికాద్రి క్షేత్రము విడిచి నారా కరుణతోడ భక్తులబ్రోవ గండి వీరరారా ॥ఆ॥ శ్రీరామచంద్రులగూడి శీఘ్రమెయిటురారా సన్నుతింప వశముగాదు సారసాక్షారారా ॥ఆ॥ తారక మంత్రముతోడ దలచినాను రారా దాసులరక్షింపవేగ ధీరవీరరారా ॥ఆం॥ కలిమియుండిన కడపపురము జేరవేగరారా కరుణతో నారాయణదాసుని గావవేగరారా ॥ఆం॥

(29) నామావళి.

ఆంజనేయరారా సంజీవరాయరారా వాయునందన రారా వాలమెత్తిరారా శ్రీరామభక్తరారా సీతపోషకరారా మారుతిరాయరారా మహనీయమూర్తిరారా యోగదేవరారా యోగాంజనేయరారా భీమశౌర్యరారా భీకరరూపరారా అందకాడరారా అంజనీపుత్రరారా కడపధీరారా కరుణలోలరారా నారాయణ పోషారారా వానరవేషరారా॥

(30) యిదియేన పండరిక్షేత్రం వోసాధులారా.

వేగమెబ్రోవవయ్యా యోగాంజనేయ యోగాంజనేయా ఘటికాద్రి మారుతిరాయా ॥వే॥లంకిణిగూల్చివేగా లంకకేతెంచిన శూరా పంకజాక్షి జాడదెలిసి లంకలో కొల్లలాడిన వీరా॥వే॥ దాపుజేరి యుండినారా దేవనిన్నే నమ్మినారా ప్రత్యక్ష

దేవుడవనీ ప్రభూనిన్నే నమ్మినారా ॥వే॥ కఠినముంచబోకుమన్నా ఘటికాద్రిహానుమన్నా హాటముజేయబోకుమన్నా తటుకున శలవొసగుమన్నా ॥వే॥ గడువుబెట్టి దప్పనేలా కడప శూరచల ముయేలా పుడమి నారాయణదాసుని వ్యతలుబెట్టితే నీకు మేలా ।వే।

## (31) నామావళి,

వేగామే బ్రోవుమమయ్యా యోగాంజనేయ హాఠము జేయబోకుమయ్యా హిమగిరి ఆంజనేయా దాపుజేరి వేడితినయ్యా దేవనిన్నే నమ్మితినయ్యా కరుణతోడ బ్రోవుమయ్యా గండి వీర ఆంజనేయా అగుడు జేయరాకుమయ్యా ఆదరించే ఆంజ నేయా.

## (32) వేరేగతిలేదురా అనువర్ణ మెట్టు.

మరుగుజేరి యుండినానురా మారూతిరాయా ॥మ॥ మరుగుజేరియుండినారా మక్కువతో వేడినారా కరుణతోడ భక్తులబ్రోచెడి ఘటికాద్రిదేవుడవనీ ॥మ॥ఆశతో నేనున్నానన్నా మోసగించకబ్రోవుమన్నా ఆపదలను దీర్చెప్రభువు ఆంజనే యుండవనీ ॥మ॥ ఆదరించే ఆంజనిపుత్రా వాదుయేల వాయు పుత్రా జగతిలోన భక్తులబ్రోచే జగజ్జట్టివనీవేయనీ ॥మ। మొన్నిదినములనుండీ అన్నా నిన్నేమారకయుండీ కన్నతండ్రివి నీవేయనీ దీనుడైన సేవజేసి ॥మ॥ పుడమి కడప పురనివాసా తడవునేయకు శ్రీనివాసా పండరీభక్తనారాయణదాసుని బ్రో వరా ఘటికాద్రివాసా ॥మ॥

(33) నామావళి హేపాండురంగా అనువర్ణ మెట్టు.

హేఆంజనేయా ఆనందరాయా రామ రామ రామా రామా రామాంజనేయా ।హే। పండరిభూపా భక్తాస్వరూపా రామ రామ రామా రామాంజనేయా తిరువళ్ళూరిదేవా పర మదీన దేవా రామ రామ రామా రామాంజనేయా యోగాం జనేయా ఘటికాద్రిరామా రామ రామ రామా రామాంజ నేయా శ్రీకడపవాసా నారాయణపోషా రామ రామ రామా రామాంజనేయా ॥హే॥

(34) పండరిక్షేత్రం భక్తులగూడుక అనువర్ణ మెట్టు.

గాలిదయ్యముల దరుమనునీవూ ఘటికాచలములో నున్నావా ఘంటానాదము శబ్దములోనా ఘణఘణమంటూ యున్నావా ॥గా॥ యిలలోకలియుగ ధర్మముకొరకై యోగ ములోనే యున్నావా శంకచక్రాచతుర్భుజుడవై చోళంగి పురములో నున్నావా॥గా॥ యోగాసనమున జపముజేయుచూ బాగాతపములో నున్నావా జపముసంఖ్య యేమారుదునని నాదిక్కుజూడకా నున్నావా ॥గా॥ గులాబిపూలా ఘుమవాస నచే గుర్తుదెలియకాయున్నావా పలుకుపలికితే పరుగిడి పోదు నని నాదిక్కుజూడకాయున్నావా ॥గా॥ భక్తులుచేసే సేవజూ చుచూ బ్రంహ్మానందమనియున్నావా భక్తిలేని నిజపాపఖర్మ డని భయము జూపుతూయున్నావా ॥గా॥ కపటినాట్యము జూపుచు కడపలోకదలక నిలచియున్నావా కఠిన చిత్తుడని నారాయణదాసుని కరుణతోబ్రోవకయున్నావా ॥గా॥

నందనందన గోకులనడీ గోపాలా అనువర్ణ మెట్టు.

ఆంజనీదేవిపుత్రా ఆంజనేయా నాకభయమొసగి బంప

వయ్యా ఆంజనేయా ॥అం॥చింతలన్నీ దీర్చవయ్యా ఆంజనేయా నా చెంతజేర రావయ్యా ఆంజనేయా బడలియుండినానయ్యా ఆంజనేయా నాబ్రిమలుదీర్చి బంపవయ్యా ఆంజనేయా ।అం। దాసుడనునేనుగానా ఆంజనేయా నాకు దారిజూపిగావవయ్యా ఆంజనేయా తడవుజేసితె తాళలేనయ్య ఆంజనేయా తక్షణంబె బంపవయ్యా ఆంజనేయా ।అం। కడపపురము జేర్చవయ్యా ఆంజనేయా నాకు కలిమిజూపి గావవయ్యా ఆంజనేయా నమ్మినట్టి నారాయణదాసుడు ఆంజనేయా మున్మార్మునిన్నె నమ్మితినయ్యా ఆంజనేయా ।అం।

(86.) పండరిక్షేత్రం భక్తులగూడుక అనువర్ణమెట్టు.

భుజబలపరాక్రమశౌర్యసాహసము భీతిచే లంకలో దెలిపెగదా నిజభక్తుడవని నీరజాక్షినీ కానవాలుగా నిచ్చెగదా ।భు। నిజభక్తుడవు నీవేయనుచూ నిన్నేరాముడు కోరెగదా నీవానరసేనలతోనే లంకా రావణుడూ హతమాయెగదా ।భు। పంకజాక్షితో రామునికేవేగ పట్టాభిషేకంబాయెగదా ఆనందం బ్రంహ్మానందంబని అయోధ్యనగరము వెలిగెగదా ।భు। యిడుములుబడి యిలనారాయణదాసుడు యీ ఘటికాచలములోనుండెగదా తడపసేయక కడపజేర్చుమని కరుణతోనిన్నే వేడెదగా ।భు।

గోపాలా నందబాలా శ్రీలోలా రాధాలోలా అనువర్ణమెట్టు.

(87) బలవంతా హేభగవంతా హేధీరా ఆంజనిపుత్రా భక్తితోనిన్నే వేడితిగదరా హేవాయుపుత్రా భక్తితోనిన్నే దలచితినీ గదరా ।బల। దేశాదేశములాదిరిగీ దాసుడనై నీభజనలు

జేసీ దీనుడనై నే నిలచినానురా యోగాంజనేయా దేవానినే శరణని వేడితిరా ।బ। శ్రీరామభక్తుడవనీ శీఘ్రముబ్రోచే దైవమునివని గ్రక్కున నేనీ ప్రక్కనజేరితిరా శ్రీరామభక్తా అక్కరతో నామక్కవదీర్చరా ।బ। కడపాపురాము విడచీ ఘటికాద్రి క్షేత్రముజేగీ హారముతో నిన్నే విడువానంటిరా ఘటికాద్రిదేవా కఠినముయేలా తటుకునబ్రోవరా ।బ। నవ నీతరాగములతో నారాయణదాసుని ప్రార్థనలతో నన్ను వేగ బ్రోవరావేరా యేవాయుపుత్రా నిన్నే నమ్మినానురా ।బల।

(38.) భక్తూల పాలిదేవుడా అనువర్ణమెట్టు.

శెలవొసంగి బంపవేమయ్యా సంజీవిరాయా జాలమేల చేరరావయ్యా ।శల। చలమేలచోళంగిదేవా ఫలమొసంగి బంప వేదేవా ।శ। ప్రాకారములుజుట్టలేనయ్యా భక్తికాని పలుమారు బిలువలేనయ్యా ప్రపంచపాపిసి భక్తుడను నేనుగానూ ।శ। అదరిచెదరి దాపునజేరితీ ఆంజనీపుత్రా ఆశతోనేనిన్నే నమ్మితి ఆపతోద్దారకనన్నాదరించి వేగనాకు ।శ। నింధపాలుసేయ బోకురా ఓధీరవీర ఇందేనన్ను నిలుపబోకురా మందమతుల కెల్ల నీమహిమంబులను దెలుప ।శ। కడప నారాయణదాసుడు ఘటికాద్రిదేవా దాసులకు దాసదాసుడు దాపులేక దేవాయని ధ్యానముతో నుండేవాడ ।శ।

39. ననువేగ బ్రోవనయ్యా నారసింహ్మా అను వర్ణమెట్టు.

నిన్నె నమ్మినానయ్యా నారాసింహా ।ని। నారాసింహా దేవా నారాసింహానే ।నిన్నె। సింహాచలా సింహామునీవే ఓంకారసింహాముసీవే హింసలన్ని దీర్చరారా నారాసింహా ।నిన్నె॥

మంగళగిరి దేవారారా మాల్యవంత ప్రభూరారా మంధుని నను బ్రోవరారా నారాసింహా ।నిన్ను। చోళంగి భూపుడవనీ జ్వాలనారసింహుడవనీ చాలనిన్నే నమ్మినారా నారాసింహ్మా ॥నిన్ను॥ యారాద్రిసింహామునీవే కదిరి నారసింహుడనీవే కొని గుండ్ల సింహారారా నారాసింహా ।నిన్ను। పుడమి నారాయణ దాసుడయ్యా కడపయందే యుండునయ్యా తడవు సేయక బ్రోవవయ్యా నారాసింహా। నిన్ను।

(40) నామావళి.

అహోబళ నారసింహో.
హేజ్వాలా నారసింహో.
హోంకార నారసింహో.
ఘటికాద్రి ,,
చోళంగి ,,
హేభూపా ,,
హ్రింకారా ,,
నాదబ్రింహ్మ ,,

(41) రామ రామ రామ సీతా అను వర్న మెట్టు.

జయ జయరామ రామ క్రిష్ణ జయజయరామరామ క్రిష్ణా.

అంజని పుత్రా హేబలవంతా ఆదరించరా వాయు ।జ।

భక్త పోషక భీకరరూపా పాలించర యీభక్తులకెల్లను। అపద్బాంధవ అనాధరక్షకా ఆదంచరా ఆర్త రక్షకా।జ

యోగాంజనేయా వీరాంజనేయా జాగేలరా అంజనితన
యా ।జ।

భుజబలశాలీ కలియుగశాలీ నిజదేవుడవు నీవేగదారా।

వానరరూపా శూరప్రతాపా వెగమే నావ్యతలుమాన్ప
రా ।జ।

దిక్కులేదురా దిక్కునీవేరా అక్కరతో నామక్కు
వదీర్చర ।జ।

కడపపురీశా వానరవేషా నారనామునీ భక్తపోషా ।జ॥



౬౦.



# యోగ నారసింహ స్వామి దండకం.

శ్రీమన్ మహాభీకరాకార హ్రీంకార హుంకార ఓంకార హే ఉగ్ర శృంగారసింహా చోళంగిసింహా హేజ్వాల సింహా నవనారసింహా నీదివ్యమూర్తిన్ స్తుతింపన్ ప్రభాతంబు సాయంత్ర నీనామ సంకీర్తనల్ చేసి నీఉగ్రరూపంబునున్ గాంచి నీపాద పద్మంబుల్ డాసి నీరూపువర్ణించి నిన్ను నేదలచెదన్ నిన్ను నేగొల్చెదన్, నీకటాక్షముజూపి, నన్ను రక్షించు దేవుండవంచున్, నీసేవభక్తుండనై రంగభక్తుండనై నానేర్పుచందంబునన్, నీకు పుష్పహారంబుగా యీదండకంబొక్కటిం జెప్పి యర్పించెదన్ గాచిరక్షించుమా నన్ను గాపాడుమా లోకరక్షామణీ, దైవచూడామణీ, ఆత్మరక్షా, నమో పాప



భక్తుల పాదధూళి,

రాజయోగి,

పండిత్ భక్త ఎ. నారాయణదాసు.

శిక్షా, పరబ్రహ్మమూర్తీ, ప్రకాశ ప్రభావమూర్తీ, త్రిమూర్తి
స్వరూపుండ వంచున్, త్రిలోక రాధ్యుండవంచున్, గ్రహ
భూత ఉగ్రుండవంచున్, కృపాదృష్టితో బ్రోతువంచున్,
దయాశాలిసింహా యాదాద్రిసింహా నిన్ను నేవేడెదన్, నిన్ను
నేదలచెదన్ నన్ను రక్షింపవే నన్ను బాలింపవే నే నిన్ను బాగ
డంగ నే నెంతవాడన్ దయాదృష్టివీక్షించి రక్షించుకోవయ్య,
మున్ నీవు భక్తునిన్ గావగానెంచియున్ స్తంభమందుద
యించి దానవేంద్రునిదృంచ మహా ఉగ్రరూపుండవై నార
సింహుడవై అండాండ పిండాండ బ్రహ్మాండ భుగుల్
భుగుల్ మనిపించి, యా ఉక్కు స్తంభంబునన్ భీకరా కా
రుండవై బయల్దేరి యా రాక్ష సేంద్రున్ బట్టి ధరన్
వేగ గొట్టియున్, పొట్టయున్ జీల్చియున్, గుండెగుత్తుల
నెల్ల గోళ్లతో బెకళించి పేగు లెల్లలవేగ మెడలోన జుట్టి
యున్ రౌద్ర ప్రచండ ప్రకాశంబు కోపంబునన్ హూంక
రించుచున్ భువికంపమొందంగ, నల్దిక్కులన్ బిక్కటిల్లంగ
యా యుగ్రరూపంబునన్ జూచి నీతో ప్రశంసింప నెవ్వరేనిన్
భీతిన్ బడి బోవకున్ డన్ ప్రహ్లాద బాలుండు, నా తండ్రి, నా
ధాత, నా దేవ దేవా, వాసుదేవా, నమోనారాయణాయం
చున్, వడిన్ జేరి నీ చరణములుబట్టి యుండన్, నీ ఉగ్రరూ
పంబునన్ నణచి శాంతించి, ప్రహ్లాద భక్తునిన్ చేరి నిన్ను
రక్షించితిన్, మెచ్చితిన్ బాల, నటించున్ భక్తునిగావలేదా,
దేవా, యోగ నారసింహుండవె, గాలి దయ్యాలధీరుండవన్
చున్ ఖ్యాతిబొందలేదా, దేవా, దేవ దేవా నన్ను గావవే,

వో భక్త మందార సింహావతారా పద్మినీనాథ సింహా సింహా
ద్రిసింహా, శ్రీతాళ్లపురిలోన తల్లి శేషమ్మ గర్భంబునఁ బుట్టి,
తండ్రి సుబ్బన్నయను తండ్రిపేర పృథ్విలో జన్మించి, కడపా
పురముజొచ్చి ఆడితిఁ పాడితిఁ వేడితిఁ దాస దాసుండనఁ
చుఁ నారాయణాదాసుడంచుఁ ప్రార్థించి భక్తితోనమ్మితిన్
రక్షించు రక్షించు రక్షించు నాస్వామి శ్రీనారసింహ్మా, నమస్తే
నమస్తే నమస్తే నమస్తే నమః.



ఓం



# లక్ష్మీదేవి దండకము

---

శ్రీమన్ మహాదేవి, శ్రీలక్ష్మీదేవీ, వరలక్ష్మి దేవమ్మా, శ్రీ ఆదిలక్ష్మి, మహాలక్ష్మి, ఓంకారి, హ్రీంకారి, పంచాక్షరీ మంత్ర పరమకల్యాణీ, పండరీక్షేత్ర రాణీ, శ్రీరుక్మిణీదేవియన్ చున్, చోళంగి జయలక్ష్మియంచున్, చాల నేనమ్మితిన్ వేడితిన్ పాడితిన్ మాతల్లి నీవనుచు మూలాంబ యనుచున్ నీమూర్తి నేగాంచి నీసొంపుసుందరంబెంచి నీపుత్ర పుత్రుండనై రంగభక్తుండనై దీనుండనై నేను చామంతితో మాల హారంబుగానెంచి నీకున్ సమర్పించి నీమీద దండకంబొక్కటిన్ జెప్పియర్పించెదన్ గాచిరక్షించవే కంచికామాక్షిదేవి కడప రుక్మిణీదేవి కృపాదృష్టితో నన్ను కటాక్షించి కాపాడరావే కోటాన దేవతల్ కోరినిన్ దలచిరే సర్వజీవులనిన్ను సర్వాత్రమని నమ్మి నిన్ను సేవింతురే భక్తులున్ ముక్తులున్ సాధులున్ సిద్ధులున్ ఎప్పుడునిన్ గొల్చు ఏకనాదముతోడ జోకతోగొల్చిరే సర్వసంపదలెల్ల సరగునన్ బడసిరే సర్వనామముతోడ

సాక్షిగాదలచిరే సర్వమతములకెల్ల సమర సంజీవని అన్నిమత
ములకెల్ల ఆది శక్తివటంచు ఆశతో వేడిరే పసుపు కుంకుమ
నీకు భద్రముగదిద్దిరే పానక-ము, వడపప్పు పదిలముగ బెట్టిరే
పచ్చచేమంతులా ప్రార్థనల్ జేసిరే పరమేశ్వరీవనుచు పద్దుతో
గొలచిరే పట్టు రవికెలునీకు పదిలముగ బెట్టిరే పంచరంగుల
తోడ ముగ్గులున్ బెట్టిరే పంచకల్యాణి తోడిరాగముల్ బాడి
రే, మధుర మీనాక్షిదేవి శ్రీద్వారకాదేవి ప్రార్థింతు పార్వతీ
సుందరీ బాలాంబ తొందరగ బ్రోవవే చాముణ్ణసన్ నా మొరల్
సాక్షిగావినవమ్మ చవుడేశ్వరీ, చాముండీశ్వరీ, మహామ్మాయి
దేవి, మక్కు-వతో నిను గొలుచువారలకు మహిమంబు జూ
పకు మళయాళదేవి, కాళికాదేవి, చల్ల, పంచామృతములు,
చక్క-గనీకిచ్చి కర్పూర హారతుల్ ఏ కలికి నీకిడువంగ పంచ
బక్ష్యాన్నముల్ బక్తిచేనీకిచ్చి పంచరంగులపూల పూజ జేసితి
నమ్మా నా మనోచిత్తంబు నీయందు నిల్పితిని నీస్మరణ యెల్ల
పుడు యెవరేనిదలువంగ సర్వార్థసిద్ధముల్ సకలముల్ కల్గునే
సంతానమున్ గల్గునే భీతిగల భూతముల్ భువికంప మొందవే
సర్వపీడల్ సమసిపోవవే మారి మహమ్మాయులట మరితొలగి
పోవే నీదాసదాసుండు నారాయణదాసుండు దేశదేశములెల్ల
పరుగిడుతిరుగంగ దిమ్మరై దుష్టుడై నిష్టతో నినుగొల్వ నా
పాలి దేవుండు పండరీనాథుండు మరి ఆంజనేయుండు ఉపదేశ
మిచ్చెను ఉర్విలో బాగడంగ పుడమిలో నాజన్మ భూమిదెల్పె
దను తాడిపత్రీయను పడమరదేశంబు కడపజిల్లాపురంబు ద్వా
రకా పురమనుచు రంగనాథుడు దెలుప రంగ రంగములాడి

శృంగార రంగని నూటిగా నేనిల్పి సన్నిధిగట్టంగ నేవేడితమ్మ
రో, రమ్ము రమ్ముము తల్లీ యిమ్మైయుండవె నాకు నీవుదెలి
పిన చోటు నిజముగాజూపించు జూపకున్ననుమరీ దిక్కెవ్వ
రమ్మకో తాకు తప్పులుదిద్ది రక్షించవేయమమ్మా మాధు
నిన్నన్‌గావు మూలాంబబాలా సరుగునన్ బ్రోవవే సర్వేశ్వరీ,
శంకరీ, మహాలక్ష్మిదేవి, జయమొసగుదేవి, నమస్తే, నమస్తే
నమస్తే నమస్తే నమః.



ఓం



# యోగాంజనేయస్వామి దండకం.

---

శ్రీమన్మహావీర ఓంకార హ్రీంకార హేభీకరాకార గంభీర హేమాద్రిధీరా, జగత్ ప్రాణపుత్రా, జగద్భక్తస్తోత్రా పవిత్రా, మహాశౌర్యవంతా, హనుమంత బలవంత, కారుణ్యవంతా, నీగిరిని నేగాంచి, నీమూర్తిసేవించి, యానందముప్పొంగి దీనభక్తుండనై దాసదాసుండనై నీనేర్పు చందంబునన్, నీమీఁద దండకంబొక్కటిన్, జెప్పఁగానెంచి, వేడితిన్, పాడితిన్

నిన్ను నేనమ్మితిఁ, గాచిరక్షించుమిూ, దీనరక్షామణీ ధీమణీ, నీప్రతాపంబు, లోకంభయంబొందు, అంజనాదేవి గర్భాన్న యా నీదివ్యచారిత్ర వృత్తాంతముల్ సన్నుతుల్ జేయ, నెనెంత వాడఁ, కృపాదృష్టివీక్షించి, దాసుండనఁ జూఁ, దగ్గరఁ దీసినన్, దయాశాలి రక్షింపుమిూ తండ్రి, మున్నీవు కిష్కింద లోనుండి లంక కేతెంచుచున్, లంకిణిన్ గూల్చియున్, లంకా పురద్వారమున్, దాటయన్ భీకరాకారతన్ ధీరతన్ బోయి, లంకాపురంబెల్ల, శోధించి, చింతించి, ధైర్యంబు రప్పించి, శోధించి శోధించి, వైదేహినిన్, గాంచి, శ్రీరాముభక్తున్ డనన్ చున్, భయంభక్తితో దెల్పి, యాపుష్ప తోటెల్ల, ఛేదించి ఛేదించి, అగ్నిహోత్రంతో యిండ్లెడ్ల భస్మంబుగావించి, రాక్షసా సమూహముఁ జంపి, శౌర్యంబు రప్పించి, వాలంబునన్ బెంచి, రావణుంజేరి, శ్రీరామ శౌర్యంబు వర్ణించి, గర్వంబ డంగించి, శ్రీరాముఁ జేరి, వైదేహి వృత్తాంతమున్ దెల్పి, సంతుష్టి గావించి, సుగ్రీవ సైన్యంబుతో జేరి, సముద్రంబు దాటిన్, వానరాసేనతో గూడి. వారదిన్ గట్టి, యవ్వారిదిన్ దాటి, లంకాపురంబెల్ల, కొల్లలాడించియున్, రావణుఁ జంపి యున్, సీతనుఁ దెచ్చియుఁ శ్రీరాము మెప్పింపవే తండ్రి నీవంటి ధీరునిన్ ప్రస్తుతింపన్ నాకున్ తరంబా బాపచిత్తుండ భక్తిహీనుండ రక్షింపుమయ్యా నాకోర్కె లీడేర్చవయ్యా మాయయ్యా నీశక్తి నీభక్తి నీయుక్తి నీకీర్తి నీయోర్పు నీపాటికిన్ నీసన్నిదన్ గాచి భక్తులున్ సిద్ధులున్ సాధులున్ భోగులున్ నిష్టులున్ గూడియున్నారిలన్ ఘటికాద్రిధీరుండవన్ చున్

గాలిదయ్యాల దేవున్డవంచున్ రక్షింతువంతున్ నీనామమంత్రం బులన్ నుడువుచున్ శ్రీరామ శ్రీరామ శ్రీరామ యనుచున్ భయంభక్తులయి నీగిరిని సేవించుతున్ గీతముల్ బాడుచున్ బాపకర్మంబులఁ బాపమంచున్ కోర్కెలీడేర్చుమన్చుఁ నీదా సదాసుండు నీసేవభక్తుండు నారాయణ్దాసుండు నీనామమెల్ల ప్పుడున్ దలచుచున్ బాడుచున్ ప్రార్తించెనయ్యా సంజీవరా యా నీనామమెవరేని దలుపంగ సర్వార్థ సిద్ధముల్ సకలముఁ కల్గుఁ, భూతబేతాళ, భువికంప మొందునే, ఖ్యాతిగలభూత ముల్ నూతిలో గలుసునే, సర్వపీడల్ సమశిపోవే, సృష్టిపై నినుదలుప, సుముఖులయి యుందురే, సుందరాకారమూర్తీ, సదా బ్రంహ్మచారీ, పరిపరీ విధముల ప్రార్థింతుదేవా, తాను తప్పులుదిద్ది తండ్రి మన్నించవె, నీ నామమంత్రం బిదేసిద్ధిగా నెంచి భజియింతు నే నెపుడు కరుణించవయ్యా నాకోర్కెలీ డేర్చవయ్యా కల్వాయి సన్నిధిన్గట్టి కాపాడవయ్యా కడప యిడుములనెల్ల కడతేర్చవయ్యా కృపనుజూచిరక్షించి నన్నేలు కోవయ్యా తండ్రి నమస్తె హనుమంత, బలవంత హేకీర్తివంతా కారుణ్యవంతా నమస్తే, నమస్తే, నమస్తే,నమస్తే నమః.





# కృష్ణలీలలు.

---

చేత్రాయిసామిదేవుడా అనువర్ణమెట్టు.

గొల్లభామలు చల్లలమ్మ బోవుచుండ, కృష్ణుడు గొల్లభామ చెరుగుబట్టి అడ్డగించును.

గొల్లభామలు॥ చల్లలమ్మ గొల్లవారమురా, గోపాల కృష్ణ, చలముయేలా చెరుగూ విడువరా ॥చ॥ పలుకకపోరా బాలకృష్ణా తులువరితుంటా పోకిరికృష్ణా ॥చ॥

కృష్ణుడు॥ బాలుడనై మీబానలు గొట్టెదనే, ఓభామలారా, పెదవుల నేనూ నొక్కి జూచెదనే॥ పలుకక పోయెద భామలార, సుంకముయిచ్చి పోవేనాకు ॥బాలు॥

గొల్లభామలు॥ పాలకడవలు బట్టాబోకురా॥ ఓబాల కృష్ణా, అత్తమామల పోరూదేకురా॥ కొత్తాకోడంద్రము మేము, కొట్టేతరిమెరు, పోరాబాలా ॥చ॥

కృష్ణుడు॥ భయములేదే యెవరీదీనాకూ॥ ఓభామ లారా॥ బాలుడనని భీతేలానేమీకు॥ పద్దుతో హద్దూదాటీ పోతే, బద్దలుగానే బానలుగొట్టుదు ॥భ॥

గొల్లభామలు॥ పెరుగుగడ్డలు బెట్టెదమూపోరా॥ ఓరోరి బాలా॥ చెరుగూవిడిచీ, పరుగూరాబాలా॥ చెరుగూ విడువా కుండిన నీచెంపలు బగులాగొట్టెదమూరా ॥చ॥

కృష్ణుడు॥ యెంతభయమూ, జూపెదరేనాకూ॥ ఓప డుచూలారా॥ సొంతమొగుడును నేనేనేమీకూ॥ అంతయిం తని, భయమూబెట్టితె, చెంతజేరీ చెంపలు గొరుకుదు ॥బా॥

గొల్లభామలు॥ కన్నుసైగలు జేయబోకురా, ఓచిన్న కృష్ణా, కన్నతిప్పలు బెట్టవాకురా॥ అగుడూచేయకు నందా బాలా॥ మొగుడూజూచిన ముప్పులుగలుగూ ॥క॥

కృష్ణుడు॥ మొగుడూమొగుడని, మురియూబోకురే, సిగ్గేల మీముద్దులనిచ్చీ, హద్దూదాటిరే॥ పగవాడను నేను గాను, పాలిండ్లను బట్టిపోయెద ॥బా॥

గొల్లభామలు॥ యెన్నిమాటలు నేర్చినావురా॥ ఓచి న్నిబాలా, కన్యలగోరుట, న్యాయముగాదురా॥ వన్నెకాడా నల్లనివాడా, వగలుబడకా పోరాబాలా ॥చ॥

కృష్ణుడు॥ నల్లనివాడని వల్లానంటూరా, ఓభామలారా॥ పిల్లావాడని వెల్లామంటూరా॥ గొల్లవాడను నేనుగాదే, యెల్లా లోకా ధారుడనేను ॥బా॥

గొల్లభామలు॥ శ్రీ కడపాపురమూ జేరెదమూ, శ్రీగంబె, నారాయణదాసునితోడ దెలిపెదమూ॥ శ్రీపండరి నాథుని యానా, పండరిభక్తుల పాదయాన ॥చ॥

కృష్ణుడు॥ నన్ను నమ్మిన నారాయణదాసుడూ, నా సన్నిధిజేరీ నన్ను వేడేదాస దాసుడూ॥ దాసుడేమీజేయగలడే, దవడానొక్కి పోయెదచూడే ॥భ॥

అమ్మమ్మా అలవిగాదమ్మ.

యశోద.

గొల్లవారి నల్లనిసామివిరా గోపాలక్రిష్ణ యిల్లిల్లెందుకు తిరిగేదావురా, అల్లిబిల్లి చందామామయని జోలబాడీ జో కొట్టీ బోతే ॥గొ॥

కృష్ణుడు.

యిల్లిల్లు తిరుగాలేదమ్మా యశోదమ్మా, లాలిలో నిద్రించీనానమ్మా, గొల్లపడుచూ చంకానిడుకొని కోరీఎత్తుక పోతే పోతీ ॥యి॥

గొల్లభామలు.

కన్నుసైగలు జేయాలేదేరా, మాకాంతనుసీవ్వూ, కేలి యాడా బిలువాలేదేరా, అన్నా చిన్నావాడవునీవని, కన్నరీతిగ జెప్పిన వినకా ॥క॥

యశోద.

చిన్నవాడని యెంచివుంటినిరా, ఓ చిన్నబాలా, చిన్ని లేడా నేర్చుకొంటివిరా చిన్నపడుచుల చెంతజేరి చిందుబందులు జేసినావట ॥నొ॥

కృష్ణుడు.

చిందుబందులు జేయలేదమ్మా, ఆచిన్నదానిని, బంతులాడా బిలచితినోయమ్మా, చక్కని బాలారమ్మని నా చెంపలు గొరికీ బంపీనారే ॥యి॥

గొల్లభామలు.

ఉట్టిమీాద బెట్టీయుండీన, ఆ చట్టిలోనా వెన్నముద్దలు బెట్టీయుండినా, చట్టీజవురి ఝుఝ్రు ఝుఝ్రున, పొట్టకు వేగా బెట్టినాడూ ॥అ॥ యశోద.

యింటనే వెయ్యావులుండగనూ ఓరన్న మన యింటనే వెన్నా ముద్దలుండగనూ, యిరుగు పోరూ గిండ్లకుబోయి, యేల దొంగాలించానేలా ॥యి॥

కృష్ణుడు.

మట్టెదూాడా పరుగిడిపోతేను, ఆదూడబోయీూ చట్టిలోనే దాగియుంటేనూ, ఉట్టిమీాదచట్టిని దింపి, గుట్టుతో తొంగి చూచితికాని ॥యి॥

గొల్లభామలు.

పడుచూవక్కతె డక్కతె పండీయుంటేను, ఓయమ్మ యూ పడుచూ ప్రక్కన పవ్వళించియున్నా, పండ్లో పాలిండ్లో యనుచు, పాలిండ్లనేబట్టినాడూ ॥అ॥

యశోదమ్మ.

బాలుడవనీ భ్రమసియుంటీనీ, ఓ బాలుడనీవ్వూ బుద్ధిమంతుడవానీ యుంటీనీ, బుద్ధీలేదా వద్దచేరి, పాలిండ్లూ బట్టీనావట ॥బా॥

కృష్ణుడు.

పాలుదాగే బాలుడనేనమ్మా, పాలిండ్లుబట్టా ప్రక్క జేరి పలుకాలేదమ్మా బంతిపండ్లని భ్రమశీ నేనూ, పట్టిచూచీ తంతేకాని ॥పా॥

గొల్లభామ.

ఆలు మొగుడూ పండీయుండగనూ, ఆ మిద్దెనెక్కి, సద్దులేకా ప్రక్కనజేరియునూ, గుద్ది గుద్ది ఏలుగిచ్చి తేలు తేలని పరుగిడినాడూ ॥అమ॥

యశోదా.

యెన్నెన్ని నేర్చినావురా, ఓచిన్నవాడ, యెన్నోనోముల గన్నదాననురా, మన్ననాతో జూచినంత, మానకున్నావూరా బాలా ॥యె॥

కృష్ణుడు.

మిద్దెపైన సుద్దులు వినబడగా, ఆ సుద్దులువిన్నా బుద్ది బాగని వద్దజేరగా, యిద్దరే మొగుసగుసలాడా, యీవద్దికేలని అరచితికాని ॥యి॥

గొల్లభామా.

నీళ్ళగుంటకు నీళ్ళకుబోతేను, ఆ నీళ్ళగట్టున నీటుగానే నిలచీయుండగానూ, నోటితోనె యీలగొట్టి, కన్యపడుచును బట్టినాడూ ॥అమ్మ॥ యశోదా.

అయిదు యేండ్లా బాలుడవూ గదరా, యెవరయినా యీ చేష్టలువిన్నా అగుడూగాదేరా ఆడవారీ జోలీబోయీ అగుడూ బరచెదవేరాబాలా ॥అ॥

కృష్ణుడు.

పాలుద్రావా నన్నూ బిలచీయూ ఆపడుచునన్నూ బాధ పెట్టి ముద్దూనిమ్మనియూ, గేలీజేసీ, గుద్దీ గుద్దీ, దవడా కొరికీ బంపినదమ్మా॥

యశోద.

యిల్లువిడచీ పోకూరాబాలా, యీ లీలలన్నీ చాలు జోలాబాడెదరా బాలా, లాలివేయుదు నందబాలా, పాలు ద్రావుదు వేరాబాలా.

కృష్ణుడు.

పరుగుతో కడపా పురముజేరెదనే, నారాయణదాసుని తోడగూడీ ఆడుచుండెదనే, పండరి భక్తులకెల్లనా, పాటలు దెల్పి పరుగుతూ వత్తూ॥

# భక్తి.

భక్తి యనునది సర్వభోగములు, భోగించుతున్నూ, భయములేక భగవంతుని ఫలముకొరకై ప్రార్థించుతున్నూ, భోగభక్తులమనిన్నీ, భాగవతులమనిన్నీ పరమపదము జేరేటందుకు మాకే అధికారమనిన్నీ, తదితరులందరు, మహాపాపులనిన్నీ వీరందరికి మోక్షములేదనిన్నీ అలంకారమునకున్నూ, ప్రజలు మెప్పించడమునకున్నూ, స్వరూపము ధరించుకొనే వైష్ణవ మతాచార మహానుభావులున్నూ, స్మార్థ మద్వద్వ బౌద్ధవ వగైరా మతాచార సంపన్నులు వారివారి మతముల ను వారుస్తుతించుకొంటూ, మామతమే శ్రేష్టమనిన్నీ మమ్ముల

మించినవీరభక్తులు మరెవ్వరులేదనిన్నీ, యేమోకొన్ని గ్రంథము లనుజూచి తర్కములు పెట్టుకుంటూ వొకరిమతమును వొకరు దూషించుకుంటూ, అడ్డబొట్టు పెట్టువారిని నిలువుబొట్టువారు దూషించుతూ, నిలువుబొట్టు బెట్టువారిని అడ్డబొట్టువారు దూషించుతూ, గుట్టేమి దెలియకుండా పోట్లకొరకున్నూ, ప్రజ్ఞలకున్నూ, ప్రతాపములు చూపుతూ, తదితర భక్తులును, దూషించుకొనుచూ తిరస్కరించుతూ, ఎగతాలిజేస్తూ ఏవోకొన్ని, గ్రంథములలోవుండిన సంస్కృత శ్లోకములను, ఉపమానముగా చెప్పి ప్రజలను మెప్పించుతూ ఆర్జనమాత్రం జాగ్రత్తగా ఆర్జించుతూ, యే కైంకర్యములకుగాని యేదాన ధర్మములు కాని తాను చేయకుండా యితరులకు మాత్రం నీతులు జెప్పుతూ, యీ భక్తియోగములోగూడా ప్రతాపశూరులయి ప్రవర్తించె వారెందరో కలరు. కొందరు మహానుభావులు లోకానుభవముగలవారై సదాచార త్యాగభక్తి గలవారై, దైవాదీనం జగత్సర్వం, అని జగత్ అంతయు, సర్వేశ్వరుండగు శ్రీమన్ నారాయణునియొక్క లీలా వినోదములనిన్నీ దేవుడు, సర్వశరీరాంతర్గమునందు నిండియుండి అండపిండ బ్రంహ్మండము అంతయు యీ జగన్నాటముగా ఆడించుచున్నాడనియు, సర్వమతములుగలవారి శ్రీమన్ నారాయణుని సర్వనామముల తో సర్వవిధముల పూజించుచున్నారనియు, సర్వప్రార్థనలు సర్వేశ్వరునివే యనియు దృడముగాభావించి వారి మనోదృఢ యిష్టదైవమును సర్వకాల సర్వావస్థలయందు మానసీకమునందు ధ్యానించుతూ, సర్వభూతదయాళులై సాధుజన సత్సాంగత్య

సాధుగుణములతో శాంతచిత్తులయి త్యాగభక్తి గలిగి, తన కున్నమటుకు దాన ధర్మములను బ్రంహ్మానందముతో దైవా ర్పితమని పూర్ణ సంకల్పముతో జరిగించుతూ, యే మతమును కాని, యే భక్తులనుకాని తిరస్కరించక పూజించుతూ, దాసాన దాసుడై నిందలకోర్చుకొని కష్టముల కోర్చుకొని సృష్టిస్థితి లయకారకుడగు శ్రీమన్ నారాయణుని మాత్రం యేమారక ధ్యానించుతూమోక్షపదవికి జెందుచున్నారు.

తల్లితండ్రులారా! యిప్పటి కాలములో, భక్తి పట్టు బడవలెనన్న కష్టము సంభవించనిదే భక్తి కుదరదు. సర్వసం దలుండి దేహమదముండి సర్వవైభవములతో నున్నపుడు, భక్తి అనునది యేమాత్రం పట్టుబడదు. పెద్దలను భూషించి పాదసేవచేయరు. యిట్టివి యేమైన సమారాధనలు జరిగించి నను కాలక్షేపములు జరిగించినను, ధర్మకైంకర్యములు చేసి నను యేదో డబ్బువున్నదని యెవరైన చెప్పితే సిఫారస్సుల పైన చేయించడమున్నూ, ఇది ఒక తమాషా అని వినోద మునకై చేయించడమున్నూ, కీర్తి మెప్పులకై తత్కాల భక్తి నిజూపి జరిగించెదరు. భయభక్తులయి వినయవిధేయత లుగలిగి సర్వ సంపదలు సర్వేశ్వరుని లీలావినోదములు గదా యనేతలంపులున్నూ, సర్వేశ్వరుని భక్తితో భయముగలిగి ఆహారవర్జితులయి భజించ వలెనన్నీ, సాధులయందు భూత దయగలిగి సంతుష్టిచేయ వలెననే, తలంపులు రోగబాధలు కలిగినప్పుడుకాని యేవ్యవహార చిక్కులతోనో, దారిద్ర దశ సంభవించినప్పుడుకాని, పుత్రాసంతానము లేక బిడ్డలకై పరిత

పించునప్పుడుకాని, వ్యాకులత చిక్కులతో నుండునప్పుడు కాని భయము భక్తి గలిగి భక్తి శ్రద్ధలతో పూజించుటకు కారణం వుండును. పై చిక్కులు యేవీ లేకుండా సర్వవిధముల సంపత్తుతో నుండు వారికి, భయము తక్కువ గనుక వారివారి భోగములు అనుభవిస్తూ భోగభక్తితో ప్రపంచమంతయు మాపాలనేయని నుండెదరు. కొందరు సర్వసంపదలుండిన్నీ, సద్గురుని కటాక్షము చేతను, సర్వేశ్వరుని పూర్ణానుగ్రహముచేతనున్నూ, సర్వము అశాశ్వతమని సర్వమును వర్జించి సర్వసంగ పరిత్యాగులయి శాశ్వతమయిన బ్రంహానందమయినసుఖమును అనుభవించుటకు, సర్వభోగముల యందును సర్వమోహ సంబంధముల యందును, అంటియు అంటకుండునట్లుండియు, ఆనందసుఖమును అనుభవించు చుండెదరు. తల్లితండ్రులారా భక్తి అనునది మీమీ మతాచారముల యందు దృఢనమ్మిక యుండినను, తదితర మతాచారములను దూషించక మీమీ భక్తి వంచనలేకుండా సద్వినియోగములను చేస్తూ హృదయమునందు భయము గలిగి, భగవంతుని ధ్యానించుతూ, భూతదయాళుడై భాగవతుల ఆరాదించుతూ త్యాగములేని భక్తి, భక్తి కాదనిన్నీ, భగవత్కటాక్షము కలుగదనిన్నీ తలచి, ఎల్లవేళల దైవనామముల నుత్సరించుతూ, కొంత కష్టములు సంభవించినను నేను భక్తుడను గదా దాన ధర్మములు చేసి దైవములను పూజించి అనేక క్షేత్ర యాత్రలు జేసినాను కదా నేను యెవరికిని చెరుపు చేయక భగవంతుని పూర్తిగా నమ్మి నందుకు నాకెం

దుకు యిటువంటి కష్టములు పెట్టు చున్నాడని విసుగు జెందక నిజభక్తుడుగా యెవరుందురో భగవత్కటాక్షము యెవరికి లభించునో అట్టివారలకు తప్పక లేనిపోని నిందలున్నా అనేక కష్టములున్నా తప్పక కలిగితీరును. అప్పట్లో మనక్షేమముకొరకు యీవిపత్తులు సంభవించుచున్నవని పూర్తిగానమ్మి బ్రింహానందముజెంది కష్టములోనే స్పష్టమగునట్లు దైవదృష్టిగలిగి అద్భుతముగా ప్రార్థించవలెను. అశాశ్వతమయిన సర్వసంపదలుండి భోగములలో వైభవముతోనుండు భోగ భక్తులకు భగవత్కటాక్షమనిన ప్రయోజనంలేదు. సర్వకష్టములు అనుభవించుతూ సర్వనెపములకులోబడి సర్వేశ్వరుని పూర్ణముగానమ్మి భజించిన దారిద్రదశలోనే భగవత్కటాక్షము పూర్ణముగాలభించి శాశ్వితమయిన సుఖపదవి జెందెదరు. కష్టముపడక భక్తుడనిన అనుభవములేనిది భక్తుడు గాడు. గానయీఘటికాచలక్షేత్రి సేవచేయుభక్తులందరు యేకష్టములు యేకోరికెలులేనిదే క్షేత్రిమునకు సేవచేయును భక్తాదులురావడం అరుదు. గాన కష్టదశలలో నుండువారున్నా కాంక్షకై ప్రార్థించువారున్నా రోగపీడల పిశాచ బాధలుండువారున్నా యీక్షేత్రమునందు భోగభక్తి మాని త్యాగభక్తిగలిగి భయముతో మీరెంత దృఢనమ్మికగల త్యాగముచూప్పి మీదృఢ త్యాగము తూకము కొలది భగవంతుడు మీమీ మనోయభీష్టలను నెరవేర్చి శాశ్వితమయిన పదవులు తప్పక సిద్ధించునట్లు మీక్షేత్రనాధుడు గటాక్షించగలడు.

శ్లో॥ సప్తప్రాకారమధ్యే సరసిజముకుళోద్భాసమానే
విమనేకావేరీ మధ్యదేశే ఫణీపతిశయనే శేషపర్యంక
భాగే। నిద్రాముద్రాభిరామం కట నికట శిరః
పార్శ్వదివ్యస్తహస్తం పద్మాధాత్రీ కరాభ్యాం పరి
చిత చరణం రంగనాథం భజేహమ్॥

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ తేజోవిరాజమానా
హే శ్రీహరికృష్ణా రామా గోవిందా నారాయణ.

హేసప్తప్రాకార గోపురమంటపాంతర శ్రీరంగ నివాసా
హే శ్రీఉభయకావేరి మధ్యస్థల శ్రీరంగనివాసా హే౹శ్రీ సక
ల గుణైస్వర్య సంపత్పరిపూర్ణ సమేత భవ్యప్రకాశా హే
దివ్యకాంతి నైమిశారణ్య బ్రహ్మర్షీశ్వర సమేతనివాసా
హే౹శ్రీ సత్యనారాయణస్వామీ హేదివ్యమంగళకర నవ్యసుం
దరరూపా హేపరమపదవాస రంగేశ పరమపురుషా హేతిం
త్రిణివాసా హే శతాష్టదివ్య మంగళపుణ్యక్షేత్రా సువర్ణ
పుష్కరణీ పుణ్య పర్వతసమేతనివాసా హే౹శ్రీవైకుంఠ విరజా
నదీసమేత దివ్యకాంతి మోక్షలక్ష్మీసువర్ణనాథా వజ్రవైఢూ
ర్య నీలమాణిక్య పేతికాశేయవాసా సర్వభూతనివాసా పుణ్య
తీర్థ కాశీయాత్రనివాసా హే౹శ్రీశేషాద్రి నిత్యకల్యాణి బ్ర
హ్మోత్సవ వైభోగ శ్రీనివాసా ఏకాంతసేవ దివ్యమంగళ స్వ
ప్రకాశా దివ్యపుష్పకవిమాన శుకమంటప మనోహరా
హేమోహినీ సుందరకల్యాణవేషా హే౹శ్రీ జగన్మోహినీ సుం
దరాంగా హే౹శ్రీజగన్మోహినీ దివ్యావతారా జానకీ మనో
నాయకా.

హేనీరజపత్రినేత్రి
హే వెంకటగిరిగోవిందాఖ్యా
శ్రీశ్రీనివాసబిరుదాంకితా
హేసర్వలోకా ప్రాణరక్షకా
హేమాయా శ్రీలక్ష్మీకాంతీపుష్ప
తులసీసుగంధ సమేత మనోహారా
హేయశోదప్రియా
హేగోపికాసంచారా
హేశుక యోగిమనోహరా
హేవ్యాసభట్టారకా
,, అంబుజనాభా
కమలగర్భహృదయేశ్వరా కమలనయనా వాసుదేవా
కమల పత్రాక్ష మాణిక్యతిలకనయనా
కోటిసూర్యప్రకాశ హేజగన్నివాసా
హేజితరాక్షసనాధా
హేగోపికానాధా
హేఆది శేషావతారా
హేఅంతర్యామిరక్షకా
పాండవదయానిధే
శంఖచక్రసీతాంబర ధారీమురళీధర గోవర్ధనగిరి
నివాసా
నవరత్నఖచిత భూషణ భూషిత దివ్యతేజశ్శరీరా

అష్టభుజ దివ్యమంగళ తేజస్స్వరూపా నవరత్న కిరీటకే
యూర భూషణా
ముత్యాలహారా కర్ణపిత్రాలంకార శాంతిదివ్య
విభూషణా
శంఖచక్ర గదాఖడ్గ సాజ్ఞ పాణీ హేకోదండపాణీ
హేఅఖండ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపా
అనంతకోటి బ్రహ్మాండ కుటుంబనాయకా
అవాఙ్మానసగోచరా
హేఅనంత పద్మనాభా
హేపరమ యోగీశ్వర హృదయా
సర్వసర్వాంతరాత్మా
హేపరమాత్మా దివ్యస్వరూపావతార
వేదవేదాంతనాయకా
సర్వలోకాధార నాయకా
దేవతా సార్వభౌమా
హేపరంధామా దివ్యప్రభావాభిరామా
శ్రీరంగేశ దత్తేశ్వరాభిరామా
తత్వమయుజరామా
సత్యజ్ఞానానంద స్వరూపా
జ్ఞాన భక్తి వైరాగ్య యోగసమేతా
హేఅష్టాంగ యోగసమేత నాయకా
హేలోకాధిపతే
హేజగద్బంధో

హేజగదాత్మకా
హేజగద్రక్షకా
హేపాండవ రక్షకా
హేపద్మినీనాథా
గోపతిరుముఖ మండల దివ్యసూర్య కాంతిస్వరూపా
దివ్యమంగళ పరంజ్యోతి స్వరూపా
దివ్యశోభన విగ్రహాసమేతా
నిర్వికార్థ మంగళ తేజస్వరూపా
మాయాప్రతి బింబేశ్వరా
మోక్షరాజనాయక సర్వద్యక్షా సకలవరదా
హేమారుతి హృదయానందా
హేసంయుక్త యోగప్రియా
హేమాయాతీతా
హేమాయామయ దివ్యదేహా కాంతి స్వరూపా
హేపండరిపుర విఠలనాథా
హేజానకీ ప్రాణనాథా
నీకల్యాణ గుణ దివ్యతేజస్సు ప్రహ్లాదుండెరుంగు నీ
సౌందర్య బలపరాక్రమంబులు గోపికాస్త్రీలెరుంగు
దురు.
నీసత్య వ్రతంబు శ్రీలక్ష్మీదేవి యెరుంగు
నీనాట్య విచిత్రంబులు నాగేంద్రుండెరుంగు
నీయద్భుతకల్యాణ లీలావినోదంబులు అక్రూరుడె
రుంగు

నీకరుణా కటాక్షంబులు పరమభక్తుడైన కుచేలుడెరుంగు
నీదివ్యమంగళ విశ్వరూపసేవ అర్జునుండెరుంగు
స్వామి నీదివ్యమంగళ వైభవంబులును నిన్ను కొనియాడను నేనెంతటివాడను.
ఓ మహాప్రభో నమ్మితిని నమ్మితిని రక్షించు రక్షించు నమో నమో శ్రీపాండురంగా

(2) శ్లో॥ శ్రీభూనీలాసమేతాయ, శ్రీరంగే శేషశాయినే,
శ్రీ వైకుంఠనివాసాయ శ్రీరంగేశాయ మంగళమ్॥
శ్రీ భోగలక్ష్మి ప్రియకాంత కల్యాణ పరిపూర్ణ
రత్న వైకుంఠ దివ్యమంగళ శేషశయన॥

పరంజ్యోతి స్వరూపా హే ఖగవాహన దివ్యమంగళకర వజ్ర కవచ కిరీటగద దివ్యకాంతి శ్రీవత్స చిహ్ననాథా, హే రుక్మిణీనాథా కృష్ణగో పోషక గోపికాసమేత మనోహార వేణు నాథా.

సమస్తకల్యాణ పరిపూర్ణ దివ్యమంగళ తేజస్వరూప గుణానిధే, హే శ్రీవైకుంఠ నవరత్న మణిమయ దివ్యవిభూషణ సువర్ణతోరణ నిత్యకల్యాణ భోగమంటపములో దివ్యమంగళ కర ఆదిశేషునిపైని శయనించిన దివ్యసూర్యకాంతి శ్రీ లక్ష్మి పద్మనాభసమేత మనోహరా, పచ్చ మకరతోరణ నిత్యకల్యాణ మహోత్సవ దివ్యమంగళ భేరీమృదంగ, పంచవాద్యకర సువర్ణ శేషపర్వత రత్నపూలంగిధరించిన, శ్రీవక్షస్థల పద్మావతీ సమేత దివ్యస్వరూపకాంతి పరిమళ గోపీ శ్రీనివాసా, నవరత్న

మణిమయ పరమపదవైర ముడిగేయూర. దివ్య స్వప్రకాశ మంగళకర విభూషణా, శ్రీనివాస కల్యాణాద్భుత దివ్యమంగళ మూర్తి పరంజ్యోతి స్వరూపా, ప్రకాశ సంపూర్ణ భవ్యప్రకాశా, హే పరబ్రహ్మస్వరూప తేజోనిధే, సత్యభామా హృదయేరా, ధర్మ సంస్థాప నాయకా అనంత కల్యాణావతార, సమస కల్యాణ గుణాకర.

హేపద్మపత్రశయన కళ్యాణ శ్రీలక్ష్మీపతే,

,, దామోదరాచ్యుతా.

,, దివ్యమంగళ విగ్రహ కాంతిస్వరూపా.

,, భూలోకసుందర లక్ష్మీనాథా.

,, అఖిలవేద వేదాంతార్థ నిర్ణాయకా.

,, శ్రీ భగవద్విలక్షణావతార.

,, గగనమార్గ దివ్యస్వరూపావతారా.

గురుకులాంబుధి చంద్రా.

మోక్షఫల సంధాయకా.

భగవధేక కార్యస్వరూపా.

హే అప్రమేయస్వరూపా.

,, గరుడవిష్వక్సేనాది నాయకా.

,, నరావతారా రాక్షససంహారకా.

,, నాచామ గోచరవైఖరా.

,, యదుశైలనాథ జనకా.

,, కోటీశ్వర శ్రీరామచంద్రా.

,, అంతరంగ భక్త ఆంజనేయసేవ,

దివ్యకాంతి స్వరూపా.
హే వైకుంఠ కైలాసగిరిస్వర్గలోక సమేత నివాసా.
హే పరమపద ఆదిశేష సమస్త ప్రాణవల్లభా.
హే కామధేను కల్పవృక్ష నిర్మాణా.
హే యవపద్మాంకుశ శ్రీపాదరేఖా,
శ్రీ భద్రాచలగోకుల బృందావన.
బదరినారాయణా శ్రీసమేత నివాసా.
హే శ్రీ వరహావతారస్వామి పుష్కరిణి సమేత
శ్రీయతిరాజ సంపత్కుమారకా. నివాసా.
శ్రీభాష్యకారాది భక్తజనస్తుత.
హే కరుణాపయోనిధే.
నీ శ్రీమహాపుణ్య చరిత్రంబులు.
బ్రహ్మాది దేవతలందరు నెఱుగరు.

మహా పాపాత్ముండును కుటిలచిత్తుడును, ఆహార హీనుండును, అసూయపరుండును, జ్ఞానభక్తి వైరాగ్య హీనుండును, కామక్రోధ మదమత్సర సమేతుండును, మందబుద్ధిగలవాడను, అగు నేను నీ కల్యాణావతారంబులు, నీ అమృతగుణంబులు, రామచిలుక కంటెనీ అమృతపలుకులను, నిన్ను కొనియాడను, నేనెంతవాడను స్వామినమ్మితిని నమ్మితిని రక్షించు నమో నమో శ్రీ పాండురంగా.

(౩) శ్లో॥ శ్రీదివ్యపద్మనాభాయ। సప్తప్రాకారగోపురే।
కావేరిచంద్రభాగతీరవాసాయ।
శ్రీరంగేశాయ శ్రీవిఠలనాథాయమంగళం॥

శ్రీలక్ష్మీకుచ కస్తూరి కల్యాణ గోపీనాథా, శ్రీగజేంద్ర ప్రియమోక్షే లక్ష్మీనాథా శ్రీశైలపర్వతనివాసా శ్రీలక్ష్మీశ్వర్య నివాసా, శ్రీరుక్మిణీ కేళీవిలాసా, శ్రీలక్ష్మీ భోగసుందరా మనోల్లాసా, శ్రీలక్ష్మీ కల్యాణస్వామి, సర్వప్రకాశా, శ్రీలక్ష్మీ ముఖ కుముదచంద్రా, శ్రీలక్ష్మీప్రాణరక్షకా, శ్రీ శ్రీనివాస, శంఖ, చక్ర, గరుడవాహనావతారా, శ్రీచక్రి వర్తి కుమారకా శ్రీకృష్ణలీలావతారా, శ్రీలక్ష్మీ నృసింహ వెంకటేశా, శ్రీరుక్మిణి పార్థసారథీ శ్రీవేణుగోపాలా, శ్రీకమలాకాంత మనోహరా, శ్రీసీతాలక్ష్మణా భరతశత్రుఘ్న హనుమత్సమేతా, శ్రీభూనళాసమేతా, శ్రీ శ్రీనివాస మహాశరణ్యా. శ్రీహరీ కరుణాకటాక్ష, శ్రీమన్నారాయణా శ్రీలక్ష్మీ భగవన్నారాయణా శ్రీ కౌసల్యానందవర్ధన శ్రీ లక్ష్మీ వక్షస్థల విరాజమాన శ్రీగోపికాజనసౌందర్య మనోల్లాసా, శ్రీ అలమేలుమంగా మనోనాయకా, శ్రీ గోపికాసుందర మనోనాయకా శ్రీవెంకటాచలపతే, శ్రీగజలక్ష్మీభక్తప్రియ మనోవల్లభా, హేకృపాజలనిధే, ఆపద్గత గజేంద్ర ప్రహ్లాద విభావనా ద్రౌపతి పరిపాలనైక ప్రయోజనప్రభో, స్వామీ నమ్మితినమ్మితి రక్షించురక్షించు, నమోనమో, శ్రీపండరినాథా,

(4) శ్లో॥ శ్రీజగన్మోహనాంగాయ । శ్రీలక్ష్మీమోక్షదాయినే
శ్రీప్రహ్లాద పావనాయ శ్రీపాండురంగే
శాయ మంగళం॥

భక్తజనోద్ధారకా, ఆపదోద్ధారకా, ఆపన్నరక్షకా, ఆపద్బాంధవా, సమస్తకల్యాణ దివ్యస్వరూపావతార, దేవకీ వసుదేవ కుమారకా, శ్రీరామమూర్తే, రావణా కుంభకర్ణ

సంహారకా, ప్రహ్లాదవ్యసన భంజకదివ్య సంభోద్భవా, శ్రీనృ సింహమూర్తీ, హిరణ్యాక్ష హిరణ్యాకశ్యప సంహారకా, సర్వ భూతదయానిధే, రుక్మిణీ ప్రాణమనోవల్లభా, జానకీవల్లభా, గోపికావల్లభా, నవనీత విస్తాంగ, భక్తపరిపాలనా, భక్తపరా ధీనా, కామితార్థఫల ప్రదాయకా, పరమదయానిధే, పరమ దయాళో దీనదయాళో, కమలలోచన, ఆదిమధ్యాంత రహిత పుష్పకారూఢ భరతాగ్రజా, హేబలరామానుజా, రుక్మిణీ కాంతసమేతా, అద్భావతార, దశావతారా, దివ్యమంగళ స్వరూపా, నరహరిరూపా, విశ్వరూపా. మన్మధరూపా, బ్రి హ్మానందస్వరూపా, పరతత్వస్వరూపా, హేభూలోక సుందర రత్నఖచిత దివ్యకాంతి శ్రీపరమపదనివాసా, సర్వభూతదయా ళో, యింద్రియాగోచరా, భావనాతీతా, సర్వవ్యాపకా, భక్త వాత్సల్యనిధే, ఆశ్రితవాత్సల్యకనిధే, హేపురాణ పురుషో త్తమా, నా పూర్వకర్మంబులన్ని, తొలగించి నాపైని కృప వుంచుమంటి, నా అపరాదము మన్నించుమంటి, కాపాడి రక్షించుమంటి, స్వామి, నమ్మితినమ్మితిని రక్షించు రక్షించు నమోనమో శ్రీపాండురంగేశ్వరా.

(5) శ్లో॥ మోహినీ సుందరాంగాయ దివ్యసౌందర్యశాలినే
విశ్వరూప దర్శనాయ శ్రీపాండురంగేశాయ
మంగళం॥

హేభక్తనాధా సర్వబంధో విజయరాఘవ వీరరాఘవ ప్రసన్నరాఘవ సత్యరాఘవ చెన్నకేసవ అన్నకేశవ ఆదికేశవ హేదీనరక్షకా.

మహనీయరూపా పన్నగశయన పతితపావన రమణీమనో హరా హేజానకీరమణా, భోగేంద్రశయన, క్షీరాబ్ధిశయన, వటపత్రశయన, సారంగపాణి, చక్రపాణి, గోకుల బృందారక గోపిక వస్త్రపహరణ, గోకుల సంచారణ, వెంకటరమణ, శ్రీజానకీపతే, శెల్వకుమారకా, నీలమేఘశ్యామా, భూలోకనాయకా, చతుర్భుజనాయకా, సర్వజీవ దయాపరా, సర్వలోక శరణ్యా, సర్వలోక నాథ, నమ్మితిని నమ్మితిని రక్షించు రక్షిం నమో నమో శ్రీపాండు రంగేశ్వరా.

(6) శ్లో॥ కమలామనోహరాయ కళ్యాణగుణశాలివే।
సర్వభూత నివాసాయ శ్రీపాండురంగేశాయ
మంగళం॥

దురితవిదూర, పాపవిదూర, శోభాయమాన, ప్రహ్లాద పావన, హేజగదీశ్వరా, హేదదీప్యమానా, భక్తవత్సల, భక్తచింతామణీ, భక్తశిఖామణీ భక్తజనప్రియా, భక్తజన పారిజాతా, హేఅనాదబంధో, హేదీనబంధో, హేదీన కారుణ్యనిధే, అపారకరుణాంబుధే, అనంతకళ్యాణ గుణనిధే, వుభయవేదాంత వేద్యా, పరాత్పరమూర్తే, సాధుజనాగ్రగణ్య అఖిలలోక శరణ్యా, దేవకీగర్భ రత్నాకరా, గోపాల రత్నాకరా, జలక్రీడ విహార, నందకుమారక, యశోదానందన, గోపికానందన, మదుసూధన, బాలగోపాల, సర్వేశ్వర, ఆజానుబాహో, ఆశ్రిత పారిజాతా, శ్రియఃపతే, అచ్యుతానంద గోవిందా, చతుర్వేదప్రియా, ఆనందవిమాన, పుణ్యకోటి విమాన, వేణుగానలోల, రఘుకులనాథ, హేద్వారకనాథ,

త్రిలోకజనక, హేవుభయ విభూతినాయకా, హేజగదీశ్వరా, కుచేలరక్షణ, ప్రహ్లాదమోక్షణా, గోపాలనందన, గోపాల చూడామణీ, హేపాండవదూతా, హేజగత్పతే హేద్వారకా పతే హేవానరనాథా హేజగతీనాథా త్రిలోకనాథా అవనీ నాథా హేజానకీకాంతామణీ హేదీనదయానిధే హేఅమరనారా యణాభ్యుత నమ్మితిని నమ్మితిని రక్షించు రక్షించు నమో నమో శ్రీపాండురంగేశ్వరా.

(7) శ్లో॥ పరంజ్యోతి స్వరూపాయ । భక్తప్రియ నివాసినే
నీరజపత్రనేత్రాయ శ్రీపాండురంగేశాయ మంగళం॥

చూ ర్ణి క .

శ్రీ కేశవదామోదర మాదవేద్యనంత పద్మనాభయుతే పరబ్రహ్మణి చతుర్ముఖపూజితే యిక్ష్వాకుహరి చంద్రమను సగర భగీరధదేవి దశరధ రామావతార్చితే, విభీషణ శేష శాయినే, పుణవాకార ఋగ్య ఋసామాధర్వణ మంత్ర చతుర్ వేద శృంగేపదవాసుదేవే సప్తప్రాకార గోపురమార్గ స్వర్ణఖచిత చిత్ర మహామంటవే, గరుడస్తంభన, గరుడమంట పగరుడోత్సవ, నిత్యోత్సవ, పత్సోత్సవ మాసోత్సవ, ఋతో త్సవ, ఆయనోత్సవ, సంవత్సరోత్సవ, వదోవత్సవ, మహో త్సవ,మహావైభవే, ధనుర్మాస వుదయకాల, స్వర్గద్వారసేవకే, భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనర్లోక, తపో లోక, సత్యలోక, అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాలాది, చతుర్దశలోకాది దేవజన మునిజన భక్తజన నానావర్ణ సకలజన మోక్షప్రదాయక చంద్ర పుష్ప

రణి పొన్న వృక్ష సంఘుతీరనిలయె వజ్ర వైఢూర్య నీల గో మేదిక పుష్యరాగ మరకత మాణిక్య కిరీట నూపురాంత దివ్య భూషణాలంకృతె । శ్రీ పాండురంగనాయకె నమస్తె నమస్తె నమస్తె నమస్తేనమః॥

(8) శ్లో॥ శ్రీలక్ష్మీకుచలోలాయ। దివ్యమంగళధారిణే సర్వ లోక శరణ్యాయ। శ్రీరంగేశాయ మంగళం॥

గరుడ తురంగ పాండురంగ వైభోగరంగ వైయ్యాళి రంగ కావేటిరంగ కస్తూరి రంగ పరిమళ రంగ పవళింపు రంగ ముద్దుల రంగ శోభన రంగ మోహాన రంగ కల్యాణ రంగ.

నాగేంద్ర వరద కళ్యాణ వరద కరిరాజ వరద కాంచీ వరద సుందర వరద ముద్దుల వరద యిభరాజ వరద హాస్తి గిరి వరద భక్త వరద యోగీశ్వర వరద కవీశ్వర వరద సుగ్రీవ వరద పరుండేటి వరద ద్రౌపదీ వరద గోపికావరద దశరథరామ కౌసల్యరామ అయోధ్యరామ పట్టాభిరామ భద్రాద్రిరామ కోదండరామ కల్యాణరామ జానకీరామ మనో భిరామ లోకాభిరామ ముద్దులరామ సుందరరామ సౌందర్య రామ గుణాభిరామ విద్యాభిరామ దానాభిరామ విభవాభి రామ నందగోపాలక్రిష్ణ యశోదక్రిష్ణ వెన్నముద్దక్రిష్ణ దోగాడె కృష్ణ దొంగకృష్ణ గోపికాకృష్ణ రాధాకృష్ణ ముద్దులకృష్ణ వై భోగకృష్ణ నవనీతకృష్ణ గోవర్ధనగిరిక్రిష్ణ కాళంగికృష్ణ జల క్రీడకృష్ణ చిన్ని బాలక్రిష్ణ గో సంరక్షణలీలక్రిష్ణ హరేరామ క్రిష్ణాధ్యవతారా త్వం మమ బిక్షాందేహి హే భగవన్

అహంపాదా భవతి అగత్య అభివాదయేత్ త్రం మాం త్రా యస్వ.

మేలుకొలుపులు.

శ్రీలక్ష్మినాయక, లోకానాయకవేగ, తెల్లావారెను. నిద్రలేవరా॥ సింహాద్రి నరసింహా అహోబళాసింహా॥ ఆనంద ముతో నిద్రలేవరా॥ స్వామిలేవరా ॥శ్రీ॥

శ్రీచోళసింహుడా స్త్రీలెల్లవచ్చిరి శీఘ్రముగా నిద్ర లేవరా సేవజేయ నీచెంతజేరినారు సేవించవలెగాని లేవరా ॥స్వామిలేవరా॥

కస్తూరితిలకము ఘనముగా దిద్దాలే కమలా వల్లభ నిద్రలేవరా కలికితురాయి కిరీటాము బెట్టాలే కరుణాసముద్రుడ లేవరా ॥స్వామిలేవరా॥

అంజనీతనయా ఓఆంజనేయాధీర అరుణోద యమాయె నులేవరా॥ అవనిభక్తూలందరు ఆశించివచ్చిరి॥ ఆనందముతో నిద్రలేవరా॥ దేవలేవరా॥ గాలిదయ్యములొచ్చి। గడబడ మం ట్రాయి। ఘంటానాదముతోడ లేవరా। గ్రహపీడ తొలగించ గిరిజుట్టి నిలచిరి॥ గండవీరా నిద్రలేవరా ॥దేవలేవరా॥

శంఖుచక్రముపేగ చేతధరియింతూవు సంజీవరాయుడ లేవరా। శంఖానాదముతోడ సాధూలునిలచిరి॥ సాధూపోషక నిద్రలేవరా ॥దేవలేవరా॥

గోపీగంధము నీకు గురుతూగ దిద్దాలె పవనపుత్రా నిద్రలేవరా పట్టెపాన్పుపుష్ప పరుపుచెదరీనాది పక్క చెదరా కుండ లేవరా ॥దేవలేవరా॥

రమణులెల్లరుగూడి రోజామాలలచేత శృంగారించా వచ్చిరిలేవరా రామారామాయని రంగామాడుకొంటూ రంగాము జూపుదువు లేవరా ॥దేవ లేవరా॥

రోగాబాధలచేత రోసి నిలిచీనారూ గ్రిహరోగముల గొట్టిలేవరా ఘటికాద్రి ధీరుడా మేటి హానుమంతూడా తటుకూన గావగ లేవరా ॥దేవలేవరా॥

కడప పండరి భక్త నారాయణదాసుని యిడుమూలు దీర్చుదువులేవరా పుడమి కలువాయిపురి పండారి నాథుని సన్నిధి గట్టంగలేవరా ॥దేవలేవరా॥

మంగళహారతి.

ఆంజనేయమంగళం సంజీవరాయమంగళం॥ ఆనందరామభక్త॥ ఆనందమంగళం॥ ఆం॥ బంగారుపళ్లెరముల బ్రంహ్మానంద మంగళం॥ శృంగారబృందములో॥ బ్రింహ్మానందమంగళం॥ఆం॥ పుడమినారాయణదాసుని। భక్తిభజనమంగళం॥ ఘటికాద్రి వాసనీకు। ఘనమైనమంగళం॥

లాలిపాట.

హానుమాలాలీ వీర హానుమాలాలీ అంగదజాంబవంతా మిత్రా॥ హానుమాలాలీ ॥హా॥ ద్రోణాద్రిని హస్తమునందుదెచ్చినట్టి॥ లక్ష్మణుని సంజీవితోరక్షించునట్టి ॥హా॥ ఘటికాచలములో హఠయోగములో నుండినట్టి॥ మేటిహానుమంతుడని నీవేంచేసినట్టి ॥హా॥ కడపపురంబులో దడబడమని గదబట్టినట్టి తడయక నారాయణదాసుని బ్రోచినట్టి ॥హా॥

1ఇది శ్రీ రంగపరాశర భట్టరాచార్య శ్రీ రంగరాజసార్వ
భౌమ శ్రీజగన్నాథా చార్య, శ్రీసుందరాచార్య కేశవస్వా
ముల ప్రియశిష్యుండ, శెట్టివంశతాంబేలి గోత్రపవిత్ర
శ్రీశేషమాంబ సుబ్బన్న నామధేయ పుత్ర నారా
యణ దాస విరచిత శ్రీ ఘటికాద్రి క్షేత్ర
మహాత్యము శ్రీఘటికాద్రి హఠయోగా
నంద భజన సంకీర్తనలు సర్వము
మొదటిభాగము దై వార్పణమస్తు.
మనోపుండరీక వరదహరి విఠల్
శ్రీజ్ఞానదేవ తుకారాం.



ఘటికాచల క్షేత్రమునందు దాసుగారు దైవాజ్ఞచే జరిగించిన శ్రీరామనవమి జయంతి 9 దినముల కైంకర్యములకు హరికథా కాలక్షేపములకున్ను విద్వాంసుల మంగళవాద్యముల ఖర్చులకున్ను, లైట్లు మండ్వాల ఖర్చులకున్ను, కైంకర్య వినియోగ ఖర్చులకు సుమారు పై ఖర్చులకు రూ 800-0-0 వరకు రొక్కం ఖర్చులున్ను, అన్నదానమునకు 10 మూటల బియ్యమున్ను, యిందుకు బెల్లం, పప్పు, కాయకూరలు, నెయ్యి వగైరా యితర చిల్లర ఖర్చులకున్ను సుమారు రూ 300-0-0 వరకు పదార్థములకున్ను, నారాయణదాసుగారికి దైవార్పితముగా యీ క్రింద కనుబర్చిన భక్తాదులు సహాయముచేసి జరిగించుచున్నారు.

మ-రా-రా-శ్రీ, చెంగల్పట్టు యస్. యస్. జయరామరెడ్డిగారు,
రివిన్యూ యిన్స్పెక్టర్.

మ-రా-రా-శ్రీ, చిత్తూరు ఆర్కాడు చంద్రశేఖరనాయకర్ గారు,
అబ్కారి

మ-రా-రా-శ్రీ, చిత్తూరు గోళ్ల వీరాస్వామి నాయుడుగారు,
అబ్కారి.

మ-రా-రా-శ్రీ, చిత్తూరు పి. రామచంద్ర నాయుడుగారు,
(చర్మాల మండి)

మ-రా-రా-శ్రీ, మార్కండశెట్టిగారు.

మ-రా-రా-శ్రీ, ఎ. జె. శ్రీనివాసమొదలియార్ గారు, చర్మాల
మండి.

మ-రా-రా-శ్రీ, ఆర్యభవాన్ కాఫీ హోటల్, పి. అనంత నారాయణయ్యర్.

మ-రా-రా-శ్రీ, A. సిద్ధారెడ్డిగారు, A. మునిసామిరెడ్డిగారు,
ప్రింటింగ్ ఆఫీసు.

మ-రా-రా-శ్రీ, డిస్ట్రిక్టు ప్రింటింగ్ వర్క్సువారు.

మ-రా-రా-శ్రీ, C. తాండవరాయ మొదలియార్ గారు.

మ-రా-రా-శ్రీ, K. శివరత్నంగారు.

మ-రా-రా-శ్రీ, లోకనాధంనాయర్ గారు.

మ-రా-రా-శ్రీ, కడప బుక్కుసెల్లర్ K. సీతామయ్యగారు,

మ-రా-రా-శ్రీ, చిత్తూరు బుక్కు-సెల్లర్ పాపయ్యనాయుడుగారు.
మ-రా-రా-శ్రీ, వైద్యం నరసింహనాయకర్ గారు.
మ-రా-రా-శ్రీ, జమేదార్ సి. యం. దొరసామినాయుడుగారు.
మ-రా-రా-శ్రీ, కడపమోడమీదపల్లె రామదాసుగారు.
మ-రా-రా-శ్రీ, మద్రాసు శ్రీరాముల శెట్టిగారు.
మ-రా-రా-శ్రీ, మద్రాసు కన్నయ్య శెట్టిగారు.
మ-రా-రా-శ్రీ, చోళంగిపురం చందలూరు సంజీవిరాయ శెట్టి,
కన్నయ్య శెట్టి. రాదయ్య శెట్టిగార్లు.
మ-రా-రా-శ్రీ, రొచ్చా కుప్పయ్య శెట్టిగారు.
మ-రా-రా-శ్రీ, చోళంగిపురం ఆర్యవైశ్య భక్తాదుల సమాజము వా
రందరు కలిసి.
మ-రా-రా-శ్రీ, ఘటికాద్రి సేవార్థులు.
మ-రా-రా-శ్రీ. చోళంగిపురం శ్రీయుత యూనియన్ బోర్డుచేర్
మెన్ గారు.
మ-రా-రా-శ్రీ, మద్రాసు టి. రాజరత్నంగారు
మ-రా-రా-శ్రీ, రామక్రిష్ణరాయుని పేట భక్తాదులు
మ-రా-రా-శ్రీ, వంగనూర్ భజన భక్తాదులు

యీ భక్తాదుల ధనసహాయముచేత, యీ శ్రీభావనామ సంవత్సర చైత్రశుద్ధ ౯ లు మొదలు చైత్ర బ ౩ లు వరకు యీ ఘటికాద్రి క్షేత్రమునందు అతివైభవముగా, భజనబృందావనములతోను హరికథల మంగళ వాద్య ఫ్లూటు కచ్చేరి నిత్యం అన్నదాన సంతర్పణలతోను, బ్రంహానందముగా స్వామికైంకర్యములు నెరవేర్చినందుకు వీరందరికి శ్రీగమె దైవకటాక్షముచేత బ్రంహ్మానంద పదవిని పొందెదరని నమ్ముతాను.

ఇట్లు విన్నవించు,
కె. సీతారామయ్య,
బుక్ సెల్లర్ కడప.

# వేదాంత గ్రంథములు.

| | |
|---|---|
| [illegible] వ్యాఖ్యాతలచే ర-<br>చింపబడిన టీకా తాత్పర్య విశేషార్థ-<br>ములతో గూడిన 6 భాగములు | 36—0 |
| భగవద్గీతా తాత్పర్యబోధిని<br>పురాణం సూర్యనారాయణ<br>శాస్త్రులవారిచే వ్రాయబడిన<br>ఆంధ్ర తాత్పర్యసహితము<br>గ్లేజు క్యాలికో బైండు | 1—4 |
| భగవద్గీత వచనము | 0—2 |
| [illegible] రాజయోగసా-<br>మృతం గ్లేజు క్యాలికో | 4—4 |
| డిటో వేదాంత రహస్యం | 3—0 |
| శ్రీ కృష్ణబోధామృతం<br>12 రాజుల కథలు | 0—12 |
| శ్రీ సీతారామాభ్యుదయం<br>16 రాజుల కథలు | 0—12 |
| [illegible] చక్రవర్తుల ఇంద్రజాలపు<br>కథలు | 0—8 |
| శుద్ధ వేదాంతతమోభాస్కరం | 1—4 |
| సుజ్ఞాన రత్నావళి | 0—6 |
| రాజయోగ ప్రదీప | 2—8 |
| యోగవిద్య 32 పటములతో | 0—4 |
| [illegible]బోధిని | 0—8 |
| [illegible] విశ్వేశ్వర సంవాదము | 2—0 |
| [illegible] తత్వములు | 0—2 |
| [illegible] జ్ఞానము | 0—1 |
| [illegible] చరిత్ర | 0—3 |
| [illegible] సారము | 0—4 |
| [illegible] తత్వ[illegible]ములు | 0—4 |
| శుద్ధనిర్గుణతత్వ కందార్థములు | 0—2 |
| డి. చిన్నసైజు తాత్పర్యం | 0—8 |
| డి. పెద్దసైజు తాత్పర్యము | 0—12 |
| కైవల్యామృతసారము | 0—4 |
| వేదాంతప్రశ్నోత్తర రత్నమాల | 0—5 |
| శ్రీరామ గురుబోధామృతం | 0—12 |
| జ్ఞానవాసిష్టము వచనం | 5—0 |
| డిటో శ్లోకం॥ తా॥ | 8—0 |
| శృంగార నైషధము | 0—12 |
| ప్రభావతి ప్రద్యుమ్నము | 0—12 |
| సారంగధర | 0—12 |
| విజయ విలాసము | 0—8 |
| శశాంక విజయము | 1—0 |
| వసుచరిత్ర | 1—0 |
| మనుచరిత్ర | 0—8 |
| పాండురంగ మహాత్మ్యము | 1—8 |
| పారిజాతాపహరణము | 0—8 |
| శివానంద లహరి టీకా, తా॥ | 0—8 |
| జైమిని భారతము | 1—8 |
| భర్తృహరిసుభాషితము | 1—0 |
| రసిక జన మనోభిరామము | 0—12 |
| కృష్ణ కర్ణామృతము | 0—8 |
| రామ కర్ణామృతము | 0—12 |
| శృంగార శకుంతల | 0—12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0—12 |
| రాజశేఖర విలాసము | 0—8 |
| మొల్ల రామాయణము | 0—8 |
| శశిరేఖా పరిణయము | 0—12 |
| కుమారాభ్యుదయము | 1—0 |
| [illegible] స్కంధము | 0—4 |

